# గోద్రెజ్ స్టోర్‌వెల్

## ఖరీదైన స్టీలు అల్మారా నిజానికి చూస్తే చివరికి చవకగా ఎలా పడుతుందంటే!



ఎందుకంటే దీనిలో మీకు: మరింత మన్నిక, మరింత భద్రత, మరిన్ని రకాల్లో ఎంచుకునే వీలు.

**ఇప్పుడు అందమూ, మన్నికా కోసం గీట్లని నిరోధించే ఫినిష్‌తో.**

**మరింత మన్నిక:**
గోద్రెజ్ కే ప్రత్యేకమైన ఆటోమేటిక్ ఎయిర్‌లెస్ ఎలక్ట్రోస్టాటిక్ పెయింటింగ్ ఎక్విప్‌మెంట్‌ను వాడి తద్వారా అత్యంత ఉత్తమమైన ఫినిష్‌ను తెచ్చారు స్టోర్‌వెల్‌కి

తుప్పు నుండి నిరోధం కోసం ప్రభావితమైన ప్రక్రియను చేసారు—దీనిని ఉత్తమ నాణ్యత గల ఉక్కుతో తయారుచేసారు అందుకే స్టోర్‌వెల్ మరింత కాలం అంటే తరతరాలుగా నిలిచి ఎనికొస్తుంది

**మరింత భద్రత**
లాక్టర్‌కి దర్వాజాకి, మరే తాళం చెవితోనూ తియ్యలేని గోద్రెజ్ తాళం గోద్రెజ్ కే ప్రత్యేకమైన, పైకి కనిపించని బందులూ, దర్వాజాని పైనుంచి కింద నుంచీ మూసి వేయడానికి త్రీ-వేలాకింగ్ సాధనం

**మరిన్ని రకాల్లో ఎంచుకునే వీలు:**
మీ ప్రతిబింబంలో ఎగుడు దిగుడులు లేకుండా ఉండకుండేలాగ, దిగుమతి చేయబడిన 'ప్లేట్ గ్లాస్' నిలువుటద్దం (137 సె మీ) పై నుంచి క్రిందదాకా మీ ప్రతిబింబం సరిగ్గా కనిపించేలా
పైకి క్రిందికి వీలుగా చేసుకోగలిగే షెల్ఫులు టయ్-బార్ హేంగింగ్ రాడ్ అనేక కలయికల్లో, వీలుగా వుండేలా
3 రంగుల్లో—ఆలివ్ గ్రీన్, స్పెషల్ గ్రే, బి వి గ్రే

**తేలికగా దొరికే వీలు:**
దేశమంతటా గల 400 డీలర్ల ద్వారా తేలికగా దొరుకుతుంది.

**గోద్రెజ్**
మెరుగైన టెక్నాలజీ, మెరుగైన విలువ.

ULKA-GS

# లిమ్కా పానం బలే మజా
# కారణాలెన్నో ఉన్నాయి తెలుసా



లిమ్కాతో నాకు విటమిన్ సి అందిస్తుంది.

నిమ్మకాయ కమ్మదనం, జిల్లనే లిమ్కాని రుచి వుంటాయి.

ఐసోటానిక్ లవణాలు నా దాహం తీరుస్తాయి.




క్రిమిరహితమైన లిమ్కా నా ఆరోగ్యాన్ని పాడవనివ్వదు.

చల్లని లిమ్కా నా మనస్సుకి ఆహ్లాదం కలిగిస్తుంది.

**లిమ్కా**

నిమ్మకాయ నీరులా మజా నిచ్చేగల పానీయం

RADEUS/PE/L/29-

సంస్థాపకులు
ఏ. వి. రామవయ్య




మేనేజింగ్ ఎడిటర్
లీలావతి రాఘవయ్య

సంపుటి 21 | మే '83 | సంచిక 4

# ఇదీ వరుస...



ఈనెల నవలానుబంధం

జ్యోతి-భాగ్యలక్ష్మి నవలల పోటీలో తృతీయ బహుమతి పొందిన నవల

## శస్త్రవిన్యాసం - అస్త్రసన్యాసం

వి. మోహన్‌కుమార్

జ్యోతి పి.బి. నెం. 1824, హైదరాబాదు - 20

జయసుధ ముఖచిత్రం : - కలర్ ట్రాన్స్పరెన్సీ : శ్యామ్.

# తొలిమాట



## ఎండాకాలమ్

ఎండాకాలం మండిపోతోంది  గడచిన శీతాకాలంలో మేము హాట్ హాట్‌గా సీరియల్స్ అందించాము. ఇప్పుడీ ఎండాకాలంలో మీకు చల్లదనం హాయి నివ్వడం కోసం "ప్రణయ వీచికల"ని పంపుతున్నాం. ఈ సంచిక నుంచీ "కల్లోల గౌతమి" ఒరవడిని మొదలెట్టాము, జ్యోతి గత సంచికల ఇదివరకటి మచ్చుతునకలని కొన్ని ఈ సంచిక నుంచీ పునర్ముద్రిస్తున్నాము. ఐస్‌క్రీంలాంటి శ్రీ బాపు కార్టూన్లు సరేసరి. ఇలా మీ మానసిక వాతావరణానికి చల్లదనపు విశ్రాంతి నివ్వాలనే మా ప్రయత్నం.

ఐతే ఏప్రిల్‌లోనే దేశమంతటా వీచిన వడగాలి శ్రీ 'ఎం. సి' మరణం' పత్రికా స్వాతంత్ర్య పవనం ఆయన. ఆ మేధావి విలేఖరికి జ్యోతి నివాళు లర్పిస్తోంది.




ఏప్రిల్ నెలలో శ్రీ యండమూరి సీరియల్ సంపూర్తి కావటం చాలా బాధనిపించింది ఎండింగ్ అద్భుతం.... మా హృదయాలమీద ఆయన సీరియల్ రాశాడనిపించింది హాట్సాఫ్ టు వీరేంద్రనాధ్. సీరియల్ కొంత కాలం సాగితే బాపుండుననిపించింది ఆయనని గ్రీన్ రైటర్ అనవచ్చునా? వారికి మా అభినందనలు చెప్పండి.. ఆ సంచికలో ద్వితీయబహుమతి నవల 'పొలి' రచనాశైలి ఆవేశాన్ని పలికించింది. విలన్ పాత్ర తప్పితే మిగతా వాతావరణం, పాత్రలు గొప్పగా ఉన్నాయి.

సి సుధాకర్
హైదరాబాద్.

ఏప్రిల్ నెల నవల "పొలి" చాలా బాగుంది ఈనాటికీ పల్లెటూర్లలో అలాంటి ఆచార వ్యవహారాలు ఉన్నాయి అంటే శరీరం గగుర్పొడుస్తుంది. కామందుల చర్యలు దారుణంగా ఉన్నాయి రచయితకు అభినందనలు.

కె. రామారావ్, హైదరాబాద్ 27.

కందుకూరి శ్రీరాములుగారి "భయపడినవాడు" కధ క్షేత్రంలో నాటిన మొదటిపదం నుండి భావాల పంట కోసేవరకు బాగుంది ముఖ్యంగా మూడు సున్నాల తర్వాత కధ సారాంశాన్ని 'స్ప్రింగ్ పాము ఈ వ్యవస్థకు ప్రతీక' అని కుప్పకొట్టటం సమాజ స్పృహను తెలపటం బాగుంది పదునుగా వుంది.

టి జ్ఞానేశ్వర్, సిద్దిపేట.

బాపు 'ద్విదశాష్టకం', జ్యోతి'కే 'జ్యోతి'- ఆయన వేసిన "ఇరవయ్యేనిమిది" చిత్రాల్లోను, 25, 87 పేజీల్లోని కార్టూన్లు "క్రూరతనం పోకడలకి" అద్దం పట్టాయి

అసలు - బాపు గీసిన ఈ వ్యంగ్య చిత్రాల సంకలనాన్ని వెలువరించే యత్నాన్ని 'జ్యోతి' తలపెట్టి పాఠకుల్లో ఆనందజ్యోతులని వెలిగించాలని మా ఆకాంక్ష।

వి వి సుబ్బారావు, ఖమ్మం.

ఏప్రిల్ నెల జ్యోతి అమితాబ్ ముఖచిత్రంతో చూడముచ్చటగా, చాలా బావుంది. యండమూరి వీరేంద్రనాథ్‌గారి ఫుల్ సస్పెన్స్ సీరియల్ "డబ్బు టు ది పవరాఫ్ డబ్బు" ఈ నెలతో ముగిసిపోతున్నందుకు విచారంగా, ఏదో పోగొట్టుకున్నట్లుగా నుంది ఈ లోటును వాసిరెడ్డి సీతాదేవిగారి స్వేచ్ఛానువాదం "ప్రణయ వీచికలు" తీర్చిందనే చెప్పాలి. ప్రారంభంలోనే ఈ సీరియల్ ఆసక్తిదాయకంగా వుంది. ఈ నెలలో జ్యోతిలో బాపుగారి కార్టూన్స్ చాలా బాగుండటమేగాక కడుపుబ్బ నవ్వించాయి. ప్రతినెల బాపు కార్టూన్స్ ప్రచురిస్తే చాలా మంచిది నీతిదాయకమైన కథల్ని ప్రచురిస్తున్న "జ్యోతి" సంపాదకులకు నా అభినందనాలు.

జి. సాంబశివరావు, సూర్యాపేట.

"పౌలి" నవల చదువుతున్నంతసేపు 'క్యూరియాసిటీ'గా ఉన్నది. రచయిత రాయలసీమ మాండలీకాన్ని చక్కగా సృజించాడు "పీడిత ప్రజాపాలన లాంటి చీకటి"లాంటి వర్ణనలు ఆలోచనా సహితంగా ఉన్నాయి చివరలో పింగరాజు పాత్ర ప్రాయశ్చిత్త మనస్కుడై ప్రజలచేత హింసింపబడి, తరువాత గోపాలం పాత్రచే అంతమొందించినట్లయితే "పౌలి" ప్రథమస్థానం నలంకరించక తప్పేది కాదు. ఈ నవల నందించిన రచయితకు, "జ్యోతి"కి యిచ్చే మా అభినందనలు.

పి. రఘురామ్ రెడ్డి, తిప్పగుంటపాలెం.

వార్తావిశేషం-

## కళాసాగర్ కన్నుల పండగ

మద్రాస్ "కళైవనాక అరంగం"లో మార్చి 19 శనివారం సాయంత్రం 6.45 ని॥లకి కన్నుల పండుగలో వీనుల వి దూ జరిగింది.

ఆ సాయంత్రం ముఖ్య అతిథిగా, దర్శకుడు, నిర్మాత శ్రీ యు. విశ్వేశ్వరరావు విచ్చేశారు విజయవాడ "డ్రామా" వారి చేత శ్రీ బాబు వరదా రచన "టెలిఫోన్" బాగా మోగించారు. తర్వాత ఆర్టిస్ట్స్ అసోసియేషన్ విజయవాడ వారిచే శ్రీ కె వి. బలరామమూర్తి గారి హాస్యవల్లరి ... "ఇల్లలికిన ఈగ"ని ప్రదర్శించారు

జ్యోతి మినీకథలపోటీలో కన్సొలేషన్ బహుమతి పొందిన కథ

# మనిషి

ఎ.డి.గౌరీశంకర్

మిట్ట మధ్యాహ్నం.

ఎండ తీవ్రంగా ఉంది.

రొప్పుతూ రోజుతూ వొక స్థూల కాయం రోడ్డుమీద నడుస్తూంది

వయస్సు అరవై దాటింది జుట్టు, మెళ్ళో రుద్రాక్షమాల. నెత్తిమీద వొళ్ళంతా విభూది పట్టలు శరీరం మీద చొక్కాలాంటిది ఏదీ లేదు. వొక కండువా మాత్రం భుజంమీద వుంది. చేతిలో వో చిన్నసైజు మూట.

వేషం చూచి సులభంగా కనుక్కోవచ్చు ఏ గుడి పూజారో లేదా పౌరోహిత్యం చేసుకొనే సాంప్రదాయ బాపడని. మడి మైల పాటించేవాడని.

అడుగుపై అడుగు పడుతూంది ఆయాస పడుతూంది శరీరం చెమటకు నెత్తిమీది విభూతి పట్టలు తుడుచుక పోతూన్నాయి. జంధ్యం వొంటికి అతుక్కు పోయింది.

జనసంచారం లేకుండా బిక్కుబిక్కు మంటూంది రోడ్డు.

అప్పుడే చర్చిగేటు తీసుకొంటూ బయటికి వస్తూన్నాడు జాన్. ప్రార్థన చేసుకొని వస్తున్నట్లున్నాడు మౌనంగా తలొంచుకొని నడుస్తున్నాడు.

రోడ్డు మలుపు వచ్చింది. వోమారు తలెత్తి చూచాడు.

అడుగుపైన అడుగులేస్తూ తడబడుతూ నడుస్తూ ముందుకు పోతూన్న ఆకారం కనబడింది జాన్‌కు.

జాన్ కాస్త అడుగులు త్వరత్వరగా వేసాడు.

"దబ్బు" మంటూ శబ్దం.

"అమ్మా" అంటూ మూలుగు. రోడ్డుమీద కుప్పలా కూలిపోయింది ఆ ఆకారం.

జాన్ పరుగెత్తుకొని వెళ్ళి నెమ్మదిగా అతన్ని లేపాడు. ఆయాస పడుతూంది ఆ ప్రాణం. అతి కష్టంమీద వూపిరి పీల్చుకోవటం జరుగుతూంది.

అతన్ని రోడ్డుప్రక్కగా వున్న అరుగుమీద పడుకోబెట్టాడు జాన్.



జాన్‌కు అతడి పరిస్థితి అర్థమయింది. కొన వూపిరితో వూగిసలాడుతూంది శరీరం.

"దా.... దాహం " అంటూ హీనస్వరం.

అటు యిటు చూచాడు జాన్. ఎవరు వచ్చే జాడ కనిపించలేదు ఒొక్క నిముషం ఆలోచించాడు. ఏదో నిర్ణయించుకున్నాడు.

ఒక్క దూకులో పరుగెత్తి చర్చి లోపలికెళ్ళి ఒొక గ్లాసు మంచినీళ్లు పట్టుకొచ్చాడు.

చర్చి గేటు వేస్తూ వో మారు ఎత్తైన చర్చి గోపురంవైపు చూచాడు.

క్రాస్ అగుపించింది మనస్సులో నమస్కరించాడు. మరుక్షణం జాన్ అతనివద్దకు చేరుకొన్నాడు.

మెల్లగాకళ్లు తెరచిచూచింది ఆకారం.

"ఆ" అంటూ నోరు తెరచింది.

జాన్ మెల్లగా అతడి నోట్లో నీళ్ళు పోసాడు. అతడి కళ్ళలో కృతజ్ఞత.

జాన్‌కేదో తృప్తి.కాసేపు మౌనం

"నీ పే రు నా..య.నా"

జాన్ కాసేపు వూరకుండి "...జా. జాన్. జానకీరామ్..." అంటూ సమాధానమిచ్చాడు

ఆ పేరు ఎంతో తృప్తినిచ్చినట్టుంది ఆ ప్రాణానికి.

"రా మ రామ." అంటూ గొణుక్కున్నాడు

అతడు చివరిసారిగా శ్వాస పీల్చి కొని కన్ను మూసాడు

జాన్ షర్ట్ లోపలినుండి మెడకు వేసుకొన్న చెయిన్ బయటికి తీసి దానికి చివర్లోవున్న క్రాస్‌ను వోమారు కళ్ళకద్దుకొని ముద్దుపెట్టుకున్నాడు. ★




**నా చుట్టూ ఉన్న ప్రపంచం నాకెన్నో కథలు చెబుతూంటుంది**

వాటిలో రకరకాల అనుభూతులుంటాయి ఆ అనుభూతులకు అక్షర రూపాన్నివ్వాలన్నది నా సరదా అలా ఇవ్వలేకపోతున్నానన్నది నా ఆవేదన.

నాలోని కథా శక్తిని నేను కాలేజీలో చదువుతున్నప్పుడు గుర్తించాను నాలుగు గేయాలు, రెండు కథలు నావి పత్రికలలో ప్రచురించబడ్డాయి అప్పుడు నాన్న నన్ను పిలిచి- "ఇది చాలా చెడ్డ వ్యసనం దీనివల్ల చెడిపోయిన వారే తప్ప బాగుపడ్డవారు లేరు-" అని నాకు చెప్పాడు. నేను రచనలు చేయడాన్నాయన తీవ్రంగా నిరసించడంతో నాకింక మానేయక తప్పలేదు

నా కాలేజీ చదువు పూర్తికాగానే నాన్న నడివయసులో అర్ధాంతరంగా చచ్చిపోయాడు ఇంటి బాధ్యతలన్నీ నామీద పడ్డాయి ఇంటికి నేనే పెద్దవాణ్ని నాకు ముగ్గురు చెల్లెళ్లు మాకు ఓ బట్టల దుకాణం, ఫ్యాన్సీ దుకాణం ఉన్నాయి డబ్బుకేమీ లోటులేదు కానీ ఇటు వ్యాపారం పనులు, అటు ఇంటి పనులు- క్షణం తీరుబడి లేదు.

నా మనసు రచనలు చేయమని గొడవ పెడుతూండేది. అప్పుడు నాన్న నన్ను ఆపాడు. ఇప్పుడు బాధ్యతలు నన్నాపు తున్నాయి

ఇద్దరు చెల్లెళ్ళ పెళ్ళి చేశాక నా పెళ్ళి అయింది ఆ తర్వాత రెండు సంవత్సరాలకు మూడో చెల్లెలి పెళ్ళి కూడా చేశాను ఇంక నా జీవితం నాకు మిగిలింది అప్పుడైనా కథ వ్రాయడం మొదలెట్టాలనుకున్నాను అప్పటికి శ్రీమతి విజృంభించింది.

ఆమెకు చాలా సరదాలున్నాయి అవన్నీ నా ద్వారానే తీర్చుకోవాలని అనుకుంటోందామె ఆమె కోరిక ప్రకారం మేమిద్దరం ఊటీలు, కాశ్మీరాలూ తిరిగాం ఆమె కోసం పట్టు చీరలు, నగలు వగైరాలకు చాలా ఖర్చు చేశాను.

వ్యాపారంలో నేను సమర్థుడిని కాదు ఆపైన ముగ్గురి చెల్లెళ్ళ పెళ్ళి బాధ్యత, లాభాలు తగ్గడం మూలంగా అటుంచి బట్టల షాపులో చాలా నష్టం వచ్చింది నా మీద జాలితోనూ, నాన్న మీద విశ్వాసంతోనూ మేనేజరు ఆ నష్టాన్నంతా తానొక్కడే భరించి, బట్టల షాపును తన స్వంతం చేసుకున్నాడు.

నాకు ఫ్యాన్సీ షాపొక్కటే మిగిలింది. పెళ్ళైన నాలుగేళ్ళకు

"ఇదైనా కాస్త తెలివిగా చేయండి" అంది శ్రీమతి.

ఆమెకు నామీద చాలా కోపంగా ఉండేది నా కారణంగా ఆమె హోదా తగ్గిపోయింది సదుపాయాలు తగ్గిపోయాయి ఇంట్లో ఇదివరకు ముగ్గురు పనివాళ్లుండేవారు ఇప్పుడు ఒక్కడే!

ఆ పైన నాకు పిల్లలు పుట్టుకొస్తున్నారు

ఎప్పుడైనా రాతకు కూర్చుందామంటే శ్రీమతి విరుచుకుని పడేది. ఉన్న షాపుని ఎలా అభివృద్ధి చేయాలీ అన్నది ఆలోచించాలిట అస్తమానూ!

నాకు ప్రజల సమస్యల గురించి, రాజకీయాల గురించి ఆలోచించాలని ఉంటుంది.

తరచు మా యింటికి నా బావమరదులు వచ్చి వ్యాపారాన్నెలా అభివృద్ధి చేసుకోవాలో ఉపన్యాసమిచ్చి వెడుతూండేవారు. విన్నప్పుడంతా బాగానే ఉండేది కానీ తర్వాత అంతా అయోమయంగా ఉండేది

నా తెలివి తేటలెలా ఉన్నాయంటే ఫ్యాన్సీ దుకాణముండీ కూడా నా పిల్లల పాలడబ్బాల కిబ్బంది పడాల్సి వచ్చేది వచ్చిన కోటాలోంచి డబ్బాలను ఎలా

బ్లాక్ చేయాలో బావమరుదులు చెప్పే వారు. కోటాలించి నా వాటా తప్ప- అవసరమైన డబ్బాలెలా తీసుకోవాలో నాకు తెలిసేది కాదు.

అయినప్పటికీ ఈ నా వ్యాపారం నష్టంమీద నడవడం లేదు. ఆదాయం నెలకు రెండువేలు. కానీ సాటివారిలో తక్కువగా ఉంటున్నానని శ్రీమతి బాధ!

ముగ్గురు పిల్లలు నాకు అబ్బాయి- అమ్మాయి-అబ్బాయి వాళ్ళ చదువులు డొనేషన్లు టెక్స్టు పుస్తకాలు దొరక్క- పోవడం హోంవర్కులు, వాళ్ళకు స్కూల్లో పాఠాలు సరిగ్గా చెప్పరు. అన్నీ నా బాధ్యతలే!

పెళ్లెందుకు చేసుకున్నానా అని చాలా సార్లు అనిపించేది. కానీ గత జలసేతు బంధనం.

రోజురోజుకీ యింట్లో పోరు ఎక్కువై పోతోంది. ఆడపిల్లకు బంగా రం చేయించాలట- ఏటా అయిదు తులాలు. మగపిల్లలకు, ఆడపిల్లలకు నెలకు రెండుసార్లేనా కొత్త బట్టలు. ఆమెకు చాలా సరదాలున్నాయి ...

నా శక్తి చాలదని తెలిసీ నన్ను సతాయిస్తూంటుంది

ఆఖరికి విసిగిపోయి నాకు చేతకాని పని ప్రారంభించాను. సరుకుల్ని బ్లాకు చేయడం.

చేతకాని పని చేస్తే ఏమవుతుంది?

పోలీసులకు కేసులు కావాలి. వాళ్ళు నాబోటి వారికోసం వెతుకుతూంటారు. నామీద నేరం ఆరోపించబడింది.

అయిదువేలు జరిమానా కాని, ఆరు నెలల జైలుశిక్ష గానీ అనుభవించా లన్నారు. ఎవరెన్ని చెప్పినా నేను విన లేదు. ఆ డబ్బుతో కూతురికి బంగారం చేయించమని చెప్పి నేను జైలుకు వెళ్ళాను.

జైల్లో ఒంటరితనం. నాకెవ్వరూ లేరక్కడ

రోజూ అలవాటైన వాతావరణానికి- దీనికీ చాలా పెద్ద మార్పు.

నేను జైల్లో ఉన్న నెలరోజుల్లో నా భార్య నా దగ్గరకు నాలుగుసార్లు వచ్చింది నేను లేకపోతే తోచడం లేదంది.

"మరి- మీ కందరికీ ఎలా గడు స్తోంది? అనడిగాను."

శ్రీమతి షాపు వ్యవహారాలు తనే స్వయంగా చూసుకుంటోందిట వస్తు వుల ధరలను నిర్ణయించడంలోనూ, వస్తువు లెక్కించి కొనితేవాలన్నది తెలుసుకోవడంలోనూ నా వల్ల చాలా అవకతవకలు జరిగాయట. చాలావాటికి

# ఆనాడూ ఈనాడూ కొందరి చర్మ సౌందర్యం ఒక్కటే!





పియర్స్— అసలైన గ్లిసరిన్ సబ్బు

మీ చర్మానికి ఆ మృదువైన సంరక్షణ ఇవ్వండి— పియర్స్‌తో. సబ్బు తయారు చెయ్యడంలో ఓ శతాబ్దపు అనుభవం స్ఫటికం లాంటి ఆ ప్రతి సబ్బు బిళ్ళలోనూ ఇమిడి వుంది. పియర్స్ ఎంతో సున్నితమైనది. మరెంతో శుద్ధమైనది— దానిలోంచి మీరు చూడగలంతగా।

**పియర్స్ మీ చర్మాన్ని యవ్వనంగా, సుకుమారంగా ఉంచుతుంది.**

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

LINTAS PS 56 (R) 1810 TL

రలు తక్కువగా ఉన్నాయట. అవి తర దుకాణాలవారు నా దగ్గర కొని ళ్ళీ హెచ్చుధరకు అమ్ముకుంటున్నా ట. నేను చాలా వస్తువులు హెచ్చు రలకు కొంటున్నానట. వారం ోజుల్లో శ్రీమతి ఈలోపాన్ని గుర్తించ ానికి నా బావమరిది సహాయపడ్డాడట ప్పుడు షాపు బ్రహ్మాండంగా నడు స్తున్నదిట.

రెండో నెలలో శ్రీమతి నన్ను చూడ్డానికి రెండుసార్లు మాత్రమే చ్చింది పనులెక్కువగా ఉంటున్నా యని చెప్పిందామె.

మూడో నెలలో ఆమె నన్ను చూడ్డా నికి ఒక్కసారి కూడా రాలేదు నాలుగో నెలలో ఒక్కసారి మాత్రం వచ్చి- 'ఇంక పరవాలేదండీ- నాకిప్పుడు వ్యాపారం గురించి చాలా తెలిసింది. ఇలాగే నడిచిపోతే మనం మళ్ళీ మరో బట్టల దుకాణం కూడా పెట్టుకోవచ్చు-" అంది

"నువ్వు చాలా తెలివైన దానివి-" అన్నాను

ఆమె సంతోషించింది - "మీరూ తెలివైన వారే-కానీ మీరు వ్యాపారానికి పనికిరారు. ఈ సంగతి నేనెప్పుడో గ్రహించవలసింది. మూడు వారాల్లో నాకు తెలిసిన మెలకువలు- పదేళ్లుగా వ్యాపారం చేస్తూ కూడా మీరు తెలుసు కోలేకపోతున్నారు-"

నేను ఒప్పుకున్నాను.

"మీరింక బెంగ పెట్టుకోకండి. వ్యాపార బాధ్యతలు మీతో పాటు నేనూ సమంగా పంచుకుంటాను. మీకు శ్రమ తగ్గుతుంది-" అంది శ్రీమతి.

నాకు చాలా సంతోషం కలిగింది. నాకు జైలుశిక్ష పడడం నా మంచికే జరిగింది ఇప్పుడు నా బాధ్యతలు బాగా తగ్గుతాయి సరుకు ఎక్కణ్ణుంచి తేవాలో శ్రీమతి నిర్ణయిస్తుంది. సరుకు ఏ ధర నిర్ణయించాలో శ్రీమతి చెబుతుంది నాకు శరీరకంగానూ, మానసికంగానూ చాలా శ్రమ తగ్గుతుంది.

పనులు చూడటానికి శ్రీమతి ఓ మనిషిని కూడా నియమించిందిట- "వ్యాపారం బాగా నడుస్తున్నప్పుడు మనం అట్టే శ్రమ పడకూడదు" అందామె నాకు వ్యాపార రహస్యాలను బోధిస్తూ.

ఇది విని నేను ఇంకా సంతోషించాను. దుకాణం పనులు చూడడానికి వేరే మనిషి ఉన్నాడు. శ్రీమతి కూడా వ్యాపారం పనులు చూడడం ప్రారంభించింది ఇంక నా శ్రమ చాలావరకు తగ్గిపోయినట్లే

ఆరు నెలల అనంతరం నేను జైలు నుంచి విడుదలై ఇల్లు చేరాను. జైలుకు

వెళ్ళి వచ్చానని నాకేమీ సిగ్గుగా అని పించడం లేదు నేను యధాప్రకారం గానే ఉన్నాను.

ఓ నాలుగు రోజులు ఇంట్లో నన్ను ప్రత్యేకంగా చూసింది శ్రీమతి ఆ తర్వాత మళ్ళీ మామూలు కధ ప్రారంభ మైంది.

"అసలే జైలుకి వెళ్ళి వచ్చారు మరింత డబ్బు సంపాదిస్తే తప్ప మన పరువు నిలబడదు-" అన్న మూల మంత్రం ఆధారంగా నన్నామె సతాయి స్తోంది.

శ్రీమతికి వ్యాపారంలో మెలకువలు తెలిశాయి. ఇంక నన్నామె ఊరికే కూర్చోనివ్వదు సంపాదన పెరిగితే అది అనుభవించడం కాదు - వ్యాపా రాన్ని పెంచాలి అదీ ఆమె నాకు చెబు తున్నది.

ఈ జీవితంలో నాకు తీరుబడి దొర కదు. ఈ బాధ్యతలు నా గొంతులో ఊపిరి ఉన్నంత కాలం నన్ను విడ నాడవు

నేను మళ్ళీ బట్టల దుకాణం తెరిచే ప్రయత్నం చేస్తున్నాను మా వీధిలో అమ్మకానికి వచ్చిన స్థలం సంపా దించాలని చూస్తున్నాను. నా బావమరిది మా ఊళ్లో పెట్టబోయే హోటల్లో వాటా దారును కాబోతున్నాను. ఇది అనంతం.

నాకు తీరుబడి మాట అటుంచి రాత్రిళ్లు నిద్రలో కూడా వ్యాపారానికి సంబంధించిన కలలే వస్తున్నాయి

మా ఆవిడ సలహా కారణంగానేమో నాకు వ్యాపారస్థుడిగా మంచిపేరే వస్తు న్నది ఎవడో దూరపు బంధువు మా యింటికి వచ్చి - తను తయారుచేస్తున్న అగరు వత్తులకు మంచి ప్రచారం వచ్చేలా చేయమని వేధిస్తున్నాడు. కమి షన్ విషయంలో ఆయనకూ, శ్రీమతికీ బేరం జరుగుతోంది చివరికి బేరం కుదిరింది. అది నా బంధువుకు మరీ అంత తృప్తికరంగా ఉన్నట్లు లేదు. అందుకని మాటల మధ్యలో నా వంక తిరిగి "అన్నట్లు నువ్వు జైల్లో ఉన్నా వటగా" అన్నాడు

బహుశా నా తక్కువతనాన్ని ఎత్తి చూపాలనుకున్నాడేమో.

నేను తడుముకోకుండా "అవును రెండు సంవత్సరాలనుంచి" అన్నాను.

నేను జైల్లోంచి విడుదలై రెండు సంవత్సరాలే అయింది జైల్లో ఉండగా అక్కడి అధికారులు దయతో నాకు సరఫరా చేసిన కాగితాలమీద రాసుకున్న కధలు, కవితలు ఫెయిర్ చేసుకునే తీరుబడి కూడా నాకుండడం లేదు

అందుకే నాకు జైలునుంచి విడుద లయినట్లుకాక జైల్లోకి విడుదలైనట్లు అనిపిస్తూంటుంది.



# "మమ్మీ, ఈ దురద, మంటను ఎలాగైనా ఆపవూ."

నైసిల్
ఉపయోగించండి
అతి శీఘ్రంగా
ఉపశమనమునిచ్చే
చెమటకాయల పౌడర్.






2 రకాం
డబ్బీలలో
దొరుకుతుంది.
'నీలం' మరియు
'చందనం.'

నైసిల్
తెచ్చుకోండి
చెమటకాయల
బాధ మరిచిపోండి.



ఔషధ యుక్త-నైసిల్

1. అధికమైన చెమటను నిరోధిస్తుంది.
2. చెమటను పీలుస్తుంది.
3. దుర్గంధాన్ని కల్గించే సూక్ష్మ జీవులను నాశనం చేస్తుంది.
4. చర్మమునకు హాయి గొల్పుతుంది.

# గుండె నిండిన వేళ



యామినీ సరస్వతి

**తన చుట్టూ** నించున్న వారి వైపు చూసింది రుక్మిణీదేవి.

అందరి ముఖాల్లో ఆందోళన, దుఃఖ వీచికలు. గుండెని రెండుగా కోసేస్తోన్నట్టు పడుతోన్న ఆందోళన

"రుక్కూ!" మంచం పై కూర్చుంటూ పిలిచాడు పరమశివం. ముప్పై సంవత్సరాలు కలిసి చేసిన దాంపత్య స్నేహ పరిమళం ఆ కంఠంలో ధ్వనించింది. వియోగవేళలో పలికే అపశ్రుతిలోని విషాదం మనస్సుని కదలించింది. ఎదలోపల సన్నని సితారాధ్వని లాంటి దుఃఖ సంగీతం.

కానీ పిలుపుకోసం ఎదురుచూస్తున్న రుక్మిణి మనస్సు ఆపిలుపుకి స్పందించలేదు. ఆమె కళ్లు మళ్ళీ ఓమారు అందరినీ పరీక్షగా చూశాయి. తను కోరుకున్న ముఖం లేదు. తన మనస్సు ఎన్నుకున్న మనిషి కనిపించలేదు. తన ఎద తపించే ఆ చూపు తన చూపుతో కలవటం లేదు ఆమె కళ్లు మూసుకుంది.

గుండెల్లో ఏదో కదలిక. ఏవో జ్ఞాపకాలు

"మినీ!"

కొండలు కోనలు అడవి సంగీతంతో ప్రతిధ్వనించినట్టు ఆ పిలుపుకి ఆమె శరీరంలోని రక్త రేణువులన్నీ ప్రేమతో తడిసిపోయాయి. 'ఊ' అంది

జీవన సంగీతం పలికినట్టు.

ఆమె చేతిని మెల్లగా స్పృశించా డతను. సన్నజాజి తీవకి తొలిసారిగా పూసిన మొదటి పువ్వుని ముట్టుకున్నంత మృదువుగా-ప్రేమగా నరాలన్నీ చిక్కు విడిన దారపు పోగుల్లాగా ప్రేమ ప్రవాహంతో నిండిపోయాయి.

"రఘూ!"

అద్దంలా ప్రతిబింబించే ఆమె హృదయం నించి వెలువడింది.

'ఎలా బ్రతుకుతున్నాం మనం! శరీరం రెండుగా విడిపోయినట్టు- వీణ రెండు ముక్కలైనట్టు-'

అతని పెదాలపై ఆమె తలిరాకు కొంపం వంటి అంగుళి కదలాడింది. 'వద్దు- మనకి వియోగం లేదు- అలా అనద్దు-' అతని తొడపై తల ఆన్చుతూ అంది. సింహాసనంపై విశ్రాంతి తీసుకున్నట్టుగా వుంది

గుండె ప్రశాంతంగా వుంది రక్తం నెమ్మదిగా ప్రవహిస్తోంది శరత్ కాలంలో తేరుకున్న జీవప్రవాహం లాగా వలపువాగు

'ఎలా వుంది ఈరోజు కండిషన్'

ఆమె కళ్లు తెరిచింది. మదిలో మెదిలే జ్ఞాపకాలు మళ్ళీ చెదిరాయి. డాక్టరు పరీక్ష చేస్తున్నాడు పరమశివం ఆత్రంగా, ఆరాటంగా అడుగుతున్నాడు. చుట్టూ వున్న అందరి కళ్ళలో అదే భావం.

'ప్చ్!' అంతు పట్టటం లేదు. శరీరంలో ఏ శక్తీ లేదు. ఏ క్షణంలోనో ఎన్నడో యీ గుండె ఆగిపోయి వుండాలి. కానీ ఏదో బలమైన శక్తి ఆపుతోంది ఎవరి కోమో ఈ ప్రాణాలు నిలిచి ఎదురు చూస్తున్నాయి. ఆమె యిష్టపడే వ్యక్తి ఎవరైనా రావాలా? అంతే! అంతవరకూ యీ యాతన తప్పదు-'

డాక్టరుగారి మాటలు ఎవరికీ అర్థం కాలేదు.

పరమశివం గారి ముఖంలో నరాలు కదిలీ కదలని చలనం. దవడ కండరం బిగిసీ బిగియకుండా ఆగింది.

ఆయనేం సమాధానం చెబుతారో అని 'ఆశగా' వుందామె.

ఆయన జవాబివ్వలేదు.

ఆమె మళ్ళీ కళ్లు మూసుకుంది.

'మినీ!'

'అలా పిలుస్తారేం! లోకంలో అంతా రుక్మిణిని రుక్కు అంటారు. దేవీ అంటారు. మీరేమిటిలా-'

'నా ప్రత్యేకమైన దేవతాహ్వానం—అనంతకోటి నామాల్లో ఒకటి కాదు-'

'ఎందుకింత ఆరాధన!'

'అది నాకేం తెలుసు- నిన్ను చూసిన తొలి క్షణంలోనే నీ పాదాలకి వందనం చేశాను. నీ అందానికి అభినందన చెప్పాను. నీ ప్రేమ కసారాల్లాటి కనులకి నీరాజనం పట్టాను.'

'అంతా మీ భావనలోని రమ్యత-'

'ఊహూఁ నీ గొప్పదనం- ఒక దేవత ఒక మనిషికోసం మానవ రూపంలో వచ్చింది- అనుగ్రహించింది- వలపు గ్రహించింది-'

'మనం యిలా కలుసుకుంటామను కోలేదు. ఎన్నడూ యిలా తప్పిపోయిన ఆ జీవితనేస్తం కనబడతాడనుకోలేదు- రుతువై పోయాక వర్షం వచ్చినట్టు-'

'మినీ- అతని కంఠంలో ఎనలేని తృప్తి- నేను జీవితంలో తల్లి ప్రేమ ఎరగను- నిన్ను చూశాక జగన్మాతని దర్శించినట్టు అనుభూతి చెందాను- నీ లాలనలో తరించి-'

సిగ్గుతో తలవంచుకుందామె.

'మినీ- నాకు అక్కా చెల్లెళ్లు లేరు. ఆరేడు జన్మలుగా సోదరిప్రేమ తెలియని వ్యక్తికి అది లభించినట్లయింది. ఆ ప్రేమనంతా అలాగే వర్షించాలని వుంది-'

ఆమె కళ్లు శారదాకాశంలో విరిసిన జాబిల్లి జంటలయ్యాయి

"నాకు కూతురుంది ఆమెని నీలా పెంచాలి నీ ధైర్యం, నీ తెలివి, నీ ఆలోచన, అన్నీ నీలా-'

'వద్దు రఘూ- నా శాప జీవితం మాత్రం వద్దు-'

'మనం ఉత్తమ స్నేహితులం నాకింతవరకూ యీ ఆత్మీయత ఎక్కడా లభ్యం కాలేదు. నీవు నా తల్లివి- నా చెల్లివి- నా దేవతవి- నా కూతురివి- నా సర్వస్వానివి-'

'నీవే తల్లివి తండ్రివి . నిజముగ స్వామీ-' మెత్తని కంఠంలో లోగొంతుకలో మధుర మధురంగా చదివింది-

'అవును-'

'నాన్నా-' పరమశివం పిలిచాడు. రుక్మిణి ఊహలు మళ్ళీ చెదిరిపోయాయి కళ్లు తెరిచింది

తండ్రి పిలుపుకి మురళి దగ్గరగా వచ్చాడు డాక్టరు వెళ్ళిపోయాడు. కోడలు, మనవలు, మనవరాళ్ళు, కూతురు, అల్లుడు అంతా అవతలి గదికి వెళ్ళిపోయారు వారం రోజులుగా ఇదే జరుగుతోంది సీరియస్‌గా వుందని టెలిగ్రాం యిచ్చాడు పరమశివం అంతా వచ్చారు. అంతదాకా ఒక పూవులో రెండు దళాలపై విడివిడిగా వుండే బొమ్మల్లాగా అంతఃగృహంలో కలసివున్నా ఎవరికి వారుగా వున్నారిద్దరూ. ఇప్పుడు మళ్లీ జన సందోహం. బంధువుల కదలికలు, ఇల్లంతా సందడి.

'ఏమిటి నాన్నగారూ,'

'టెలిగ్రాం యిస్తావా!'

'ఎవరికి నాన్నగారూ!'

పరమశివం భార్యవైపు చూశాడు. పాతిక సంవత్సరాలుగా చూసే చూపే- అయిష్టత- కోపం- అసూయ ప్రతి

తించించే చూపులు. రుక్మిణీదేవి కళ్ళల్లో ఆ భావాలని చదివిన పరిచయం.

'అతనికే- రాఘవరావు- ఎస్టేట్ ఆఫీసర్ ...'

మురళి ముఖంలో కండరాలు కదిలాయి. అదే అయిష్టత అదే కోపం అదే అసూయ. అచ్చం పరమశివం ప్రతిబింబం మురళి రూపులోనే కాదు మనస్సులోనూ- ఈ కుటుంబం ఇంతే- అనుకుందామె

ఆమె కళ్లు మూసుకపోయాయి.

'లోకం ఏమనుకుంటుంది?'

'లోకం ఏ - అనుకోదు. దానికేం తెలుసు?'

'మినీ- నాతో వచ్చేస్తావా?' ఇంట్లో శతాబ్దాలుగా ఖాళీగా వున్న పూజా మందిరంలో దేవీ విగ్రహాన్ని ప్రతిష్టించుకోవాలని తపస్సు చేస్తూ ఫలించి కోరిక కోరినట్టుగా అడిగాడు.

'ఏ జన్మలో ఏ పాపం చేసుకున్నానో- మీకు దూరమై యీ బ్రతుకు లాక్కొస్తున్నాను వద్దు, మళ్ళీ ఒకరికి అన్యాయం చేసి- పాపం మూటకట్టుకోనా?'

నిట్టూర్చాడు అతను

'రఘూ! నాదొక్కటే కోరిక- చివరి ఘడియల్లో నీ ఒడిలో తలదాచుకుని నీ కళ్ళల్లోకి చూస్తూ నా చూపులు నీ చూపులతో కలసిపోయి ప్రాణం ఆవిరై పోవాలి. అప్పటికి ఇద్దరికి వయసై పోయి వుంటుంది. మనవాళ్ళకి ఎవరికీ అనుమానాలు వుండవు. విషపు చూపులు చూడరు-'

'మినీ- ఎక్కడున్నా ఎలా వున్నా యీ నీ కోరిక తీరుస్తాను. బ్రతుకు పంచుకోలేక పోయినా చావునయినా పంచుకుందాం'

'రఘూ! యీ మాట నిలుపుకోవాలి-'

పద్మదళంలాటి ఆమె చేతిలో చేయి వేశాడు.

'ఎన్ని జన్మల బంధం ఇది'

'మనకి వియోగం ఎక్కడిది మినీ-' అతనొక్క క్షణం ఆగేడు. "నీవులేని ఊహ లేదు నిన్ను ఊహించని క్షణం లేదు. ప్రతిదానికీ నీ తీపి తలపు. ఎంత పోగొట్టుకున్నాను' తెలిసిన బాధ. అయినా ఈ మనస్సు- ఈ మమత- ఈ గుండె చప్పుడు నాదే అన్న తృప్తి- రాక్షసులతో జీవిస్తోన్నా దేవతాభావన అమరమవుతున్నది-'

'చాలు రఘూ!'

'టెలిగ్రాం యిచ్చి వస్తాను' మురళి పాదాలు కఠినంగా నేలని తాకుతూ కదలుతున్న శబ్దానికి కళ్లు విప్పింది రుక్మిణి.

"రుక్కూ!"

ఏ భావమూ ప్రకటించని చూపు. పాతికేళ్లుగా అలాగే చూస్తోంది. ఎన్నడూ అసంతృప్తి ప్రకటించలేదు.

కానీ ఆ మనిషికి తృప్తిలేదని తెలుసు. దేనికి అడ్డు చెప్పలేదు. కానీ దేన్లోనూ యిష్టంలేదని తెలుసు. శత్రువులు జీవితం పంచుకున్నట్టుగా బ్రతికారు ఇద్దరూ- ఇది ఎందరికి తెలుసు-

"టెలిగ్రాం యివ్వటానికి మురళి వెళ్ళేడు-"

రుక్మిణి అదోలా చూసింది నమ్మీ నమ్మని స్థితి

"రాఘవ గారికి-"

ఆమె కళ్లు మూసుకున్నది.

ఎదలో తీపి తలపులు సంగీత ఝురులు .. ప్రణయ సాగర సంగమవేళలో పరువులెత్తే నదీ కన్య పరవళ్లు

"రాఘవా! ఇంత నిర్మోహమైన మోహం- ఇంత నిర్మలమైన ప్రేమ- ఇంత నిస్వార్థమైన ఆరాధన- ఎన్ని జన్మల తపఃఫలితమో! నేను అదృష్టవంతురాలిని-"

"మినీ!" అతని గొంతు ఆర్ద్రమైంది "ఇది యిది . ఒకరికి చెపితే తెలిసేది కాదు వెన్నెల చల్లదనం- పూల కమ్మదనం- వలపు తీయదనం- ఇవన్నీ అనుభవ పరిమళాలు-"

"రఘూ! నేను జాబ్ వదిలేస్తున్నాను....నీకు ట్రాన్స్‌ఫర్ అవుతుంది కదా!" ఆమె కంఠం రుద్ధమైంది. "మన వృత్తి అందరిలా కాదు. డెడికేటెడ్‌గా లేకపోతే ఎన్నో ప్రాణాలు పోతాయి-"

"మినీ!-" అతని కంఠం రుద్ధమైంది "నా వల్ల ఎన్ని బాధలు-"

అతని మాటలు పూర్తి కాలేదు ఆమె దీనంగా చూసింది. "ఇది బాధా. నాకు ఈ జన్మలో భగవంతుడు ప్రసాదించిన వరం! నిన్ను చూసేదాకా నేనేం పోగొట్టుకున్నానో తెలీలేదు. నిన్ను చూశాక నాకెంత సౌభాగ్యం దక్కిందో తెలుసుకున్నాను. రఘూ! మనకొక లోకం కౌలతలలో కొలవద్దు వేంచు వాకిళ్ళు తెరుచుకొని గుండె ఎదురు చూసింది నీ కొలువు కోసం. శతపత్రాల్లాగా యీ కళ్లు విరిసేది నీ చూపు కోసం అంతే!"

"మినీ-" ఆమె వైపు ఆర్తి ఆరాధన అనురాగం నిండే కళ్ళలో చూస్తూ అన్నాడు. "మళ్ళీ మనం ఎప్పుడు కలుసుకుంటామో! చివరి చూపులకోసం తప్పక వస్తాను. అంతదాకా నువ్వు యీ గుండెల్లో సజీవ మూర్తిగా వుంటావు మనకి వియోగం లేదు, విరహం లేదు."

"ఒక పాట"

"పాడు మినీ . . ఎప్పుడూ నీ పాట నా చెవుల్లో చల్లని సంగీతం వినిపించేలా పాడు. . ."

అతని ఒడిలో శయనించింది ఆమె.

ప్రశాంతమైన కాసారంలా వుంది మనసు. పదాంభరాలు మృదుపరిమళాలని వెదజల్లుతున్నట్టుగా అంతరంగ తరంగాలపై వలపు వాసనలు విరజిమ్ముతున్నట్టుగా పాడింది.

"మినీ-"

"రఘూ! ఇలా మరణించాలి నేను"

"రుక్మిణీ"

చప్పున కళ్ళు తెరిచింది. తపోభంగమైన యతిలా చూసింది. ఎదురుగా.... సోదరుడు ...

"ఎలావుంది?"

జవాబు చెప్పలేదామె ఆమె కళ్ళలో నిరాశ .. తాను ఎదురు చూస్తున్న రూపం కోసం నిరీక్షణ

○ ○ ○

రెండు రోజులు గడిచాయి. లోగడ గడిచిన ఎన్నో రోజుల్లాగే డాక్టర్ వస్తున్నాడు ఇంజక్షన్లు ఇస్తున్నాడు. మాత్రలు మింగిస్తున్నాడు. టానిక్కులు గొంతుద్వారా జారిపోతున్నాయి. పరిస్థితిలో మాత్రం మార్పు లేదు. పరమశివం, మురళి, సారధి, కోడలు, కూతురు, మనవలు, మనవరాండ్రు అంతా ఎవరి ధోరణిలో వాళ్ళు

కాఫీలు, టీలు-టిఫిన్లు, భోజనాలు, నిద్రలు ... చర్చలు ...

రుక్మిణీదేవి మాత్రం శ్రీరాముడి కోసం శబరిలా నిరీక్షిస్తోంది. ఆమె మనస్సు క్షణమే యుగమై వలపే వగపై బ్రతుకే సగమై అతని 'రాక' కోసం నిరీక్షిస్తోంది.

"వస్తాడు.... తప్పక వస్తాడు.... ఇన్నేళ్ళు గా ఆ రాక కోసం ఆ మనిషి కోసం ఆ మనసు కోసం ఎదురు చూస్తోంది తను. పిలుపు అందటం లేదా! యీ టెలిగ్రాములూ, యీ ఉత్తరాలు, యీ ట్రంక్ కాల్స్ యివేవీ తమ మధ్య అక్కర్లేదు. మనస్సులో తను చేసే తపస్సు - తన పిలుపు-అవి చాలు.

తప్పక వస్తాడు.... ఇన్నేళ్ళ యీ నిరీక్షణకి ఫలితం కావాలి . . అతని ఒడిలో శాశ్వతంగా శయనించాలి..

వచ్చే జన్మలో యీ బంధాలు-యీ అడ్డు - యీ అవరోధం ... యివేవీ వుండవు. తను భగవంతుడితో పోరాడుతుంది అతనికోసం - అతని కోసమే జన్మిస్తుంది భావం, భాష, గీతం, సంగీతం, జీవం, జీవితం; మనువు, మనసు కలిసేలా కలిసిపోతారు

ఇదీ దాంపత్యమంటే - దంపతులంటే వీళ్ళు అన్నట్టుగా జీవిస్తారు. ఒక రూపం రెండు శరీరాలు అయినట్టుగా, ఒక ఆత్మ స్త్రీ పురుషులుగా జన్మించినట్టుగా కలిసి మెలసి బ్రతుకుతారు.

తమకి పోలిక లేదు. వుండదు. వుండబోదు. తాము తామే - తమ కల

యికే కలయిక - తమ జీవనమే జీవనం - తమ ప్రేమే ప్రేమ....

"రుక్కు"

ఊహలు చెదిరిపోయాయి.

"ఎప్పుడూ యింతే" అనుకుందామె.

"అటు చూడు - ఆయనొచ్చారు"

సూర్యబింబం వైపు ప్రొద్దుతిరుగుడు పువ్వు తిరిగినట్టు చప్పున చూపులటు మళ్ళేయి.

"రఘూ" పెదాలు కదిలాయి.

"మినీ" పెదాలు అస్పష్టంగా కదిలాయి.

ఆమె చేయి చాచింది. చేయి కలిపాడు అతను. ఒకటి జన్మబంధమైన స్పర్శ.. పరమ శీతలమైన స్పృహణీయమైన స్పర్శ.

ఇన్ని రోజులుగా నోట మాట లేదు. ఇపుడు స్పష్టంగా బాగా మాటాడుతోంది... మంచంపై కూర్చున్నాడు రాఘవ పరమశివం ముఖంలో గంటు పెట్టినట్టు అతను బయటికి వెళ్ళిపోయాడు.

"రఘూ! నీ మాట నిలుపుకున్నావు. నా చివరి క్షణాల్లో వస్తానని నా కిచ్చిన మాటకి కట్టుబడ్డావు. నా జన్మ ధన్యమైంది. ఇన్నాళ్ళూ ఈ ప్రాణాలు నీ కోసమే నిలిచాయి"

"మినీ" ఆమెను చూస్తూ పిలిచాడు

యాభై వసంతాలు గడిచిన శరీరం అయినా పాతికేళ్ళ పరువం కనిపిస్తున్నది. తలలో ఒక వెంట్రుకైనా నెరవలేదు ముఖంలో ఒక ముడతైనాలేదు కళ్లు స్వచ్ఛంగా ప్రేమకాసారాల్లా - పెదాలు అందులో పూచిన మందారాల్లా ఎలా నిలిచింది యిన్నేళ్లీ యవ్వనం ... వయస్సు అక్కడే ఆగిపోయినట్టు - వలపు సితార జీవన గీతం పాడుతున్నట్టు-

"రఘూ" ఆమె పిలిచింది మళ్ళీ ... "ఇన్నేళ్లు యీ బతుకుతో రాజీపడ్డాను. ఆయన కోసం, కూతురి కోసం, కొడుకోసం బతికేను. ఇపుడు నా కోసం మరణిస్తాను . నా కోరిక కోసం కన్ను మూస్తాను. "

"మినీ" అడ్డు తగిలాడు అతను ...

అంతలో పరమశివం, మురళి, ప్రేమ లోపలికి వచ్చారు అతనలాగే కూర్చున్నాడు.

"శివా-" భర్తని పిలిచిందామె "ముప్పై సంవత్సరాలు నిన్నిలా పిలవలేకపోయాను. అది నా తప్పుకాదు.... నా మనస్సుని స్పందింప చేయలేని నీ దోషమది. మురళీ! నువ్వూ కన్నతల్లిని నన్ను బంధనాల్లో వుంచావు ప్రేమ కూడా అంతే. నన్ను అర్థం చేసుకో

లేదు. నేనేనాడూ నా మనస్సు విప్ప లేదు అందుకు మీరు అవకాశం కల్పించలేదు"

"రుక్కూ-"

"అదిగో-ఆ పిలుపే నాకిష్టం లేదు ఆ మాత్రం కూడా మీరు గ్రహించ లేదు ఎప్పుడూ మీకు మీ లా, మీ ప్రాక్టీసు- మీ క్లయింట్స్"

"చూశారా" రాఘవవైపు చూసి అన్నాడు పరమ శివం "నేను ఆమె దృష్టిలో దోషిని"

"ఊహూ- నా మనస్సుని చంపిన హంతకులు"

"అమ్మా"

"మీకు తెలియదు-మీరేం చేశారో- భర్తని, కన్నవాళ్ళని ప్రేమించలేక పోయాను- అదృష్టం కొద్దీ ద్వేషించ లేదు - ఏ స్పందన లేకుండా జీవిం చాను"

"చూశారా! ఎలా మాటాడుతుందో. ఇప్పుడు నన్ను- నన్ను దోషిని చేస్తు న్నది "

"అది సంధి ప్రేలాపన నాన్నా!"

మురళి మాటలకి నవ్వింది ఆమె

"అదిగో- మీ స్థాయి అది అంతే!"

"సర్" పిలిచాడు రాఘవ. "ఆమె ఒక రసమయి- ఒక రాగవాహిని- ఒక ప్రేమమూర్తి - ఆమె మనస్సు రస గంగాధరం"

"ఒట్టి శృంగారమయం"

"అవును-అలంకారమయం"

"ఊహూఁ 'అలంకారప్రాయం"

ఆమె పెదాలు విచ్చుకున్నాయి

"రఘూ! ఆయనతో మాటాడకు - ఆయన స్థాయి అంతే నేను ప్రయ త్నించి మార్చలేకపోయాను. సాధ్యం కాలేదు నీవు వాదనతో మార్చగలవా!

ఊషర క్షేత్రంలో పన్నీరు కురిసినా, కన్నీరు కురిసినా వ్యర్థమే"

రాఘవ మాట్లాడలేదు.

"రాఘవగారూ! ఇంత కంటే ఘోరం వుంటుందా "

"పరమశివం గారూ! ఒక జీవిత కాలం గడిచిపోయింది ఆమె మనసు నిత్యాగ్నిగోళంలా దహించుకపోయింది పోనివ్వండి ఈ చివరి ఘడియల్లో నయినా ఆమెని ప్రశాంతగా వెళ్ళిపో నివ్వండి"

పరమశివం మాట్లాడలేదు. భార్య వైపు చూశాడు

అదే సమయంలో రాఘవ అటు చూశాడు అతనికి ఒక మహారాణి మరణశయ్యపై వున్నట్టు అనిపించింది ఒక దేవతామూర్తి అవతారం చాలించ బోతున్నట్టుగా వుంది ఎంత వారికైనా మరణం తప్పదు అయినా మరణం లోనూ ఇంత హుందాతనమా?

"రఘూ!"

అతనామె దగ్గరికి వెళ్లేడు.

"కూర్చో"

మంచంపై ఆమె తలవైపు దగ్గరగా కూర్చున్నాడు.

"ఇలా జరుగు - దగ్గిరగా రా!"

అతని ఒడిలో తల పెట్టుకున్నది. సింహాసనంపై కూర్చున్న అనుభూతి మె ముఖంలో కనిపించింది"

"నాకు పాడాలనిపిస్తోంది-"

అతనామెనే దీక్షగా చూస్తున్నాడు

"రఘూ! యీ సంఘం కట్టుబాట్లతో నం దూరంగా బ్రతికేం ఈరోజు జీవితానికి ఆఖరి రోజు మళ్ళీ పరి తే రేపటి జీవితయానంలో నీ తోడు వాలి. నీ నీడ కావాలి నువ్వు జోడు వాలి."

"మినీ-" ప్రేమగా పిలిచాడు. 'భగ ంతుడు ఎంతో దయామూర్తి- మన రిక తీర్చాడు. తీరుస్తాడు-"

"మరుగేలరా ఓ రాఘవా!"

ఆమె పెదాలు విచ్చుకున్నాయి ండె వేణుగానం పాడుతున్నది వలపు సంతమైంది. వధువ మధుమాసమైంది

"అన్ని నీ వనుచు నే అంతరంగ మన- తిన్నగా వెదికి తెలుసుకుంటి య్య- నిన్నేగాని మదిని ఎన్నజాల రుల-"

నరాలన్నీ శృతులై పాడుతున్నాయి-

"మరుగేలరా ఓ రాఘవా!"

"మినీ!"

"రాఘవా!"

ఆమె చూపులు అతని చూపులతో లయించాయి అతని ఊపిరిలో ఆమె ఊపిరి కలిసిపోయింది. అతని చేతిలో ఆమె చేయి కలసిపోయింది

ఆ చూపులు అలాగే నిలిచాయి

ఆ ఊపిరి అలాగే నిలిచిపోయింది.

ఆ చేయి అలాగే బిగుసుకుంది.

అది ప్రకృతి ఓడిపోయిన క్షణం, భగవంతుడు అనుగ్రహించిన క్షణం.

మనసా వాచా ఏకీకృతమైపోయిన రెండు ఆత్మలు కలసిన దాంపత్యం వెల్లివిరిసిన మధుర క్షణం

'రుక్మిణీ'- పరమశివం గాబరాగా పిలిచాడు.

ఆమె అతని పిలుపు కందని దూరంలో పయనిస్తోంది

'రఘూ' గారు- తట్టి పిలిచాడు పరమశివం

దబ్బున పడిపోయాడు రాఘవ. అతను ఆమె కలసి సుదూర తీరాల్లో పయనిస్తోన్నారు ఇన్నేళ్లు కలసి జీవించ లేని, కలసి మాటాడకూడని, కలసి నడవలేని 'వాళ్లు' కలసి పయనిస్తు న్నారు

మురళి, ప్రేమ గొల్లుమన్నారు.

ఒకే క్షణంలో ప్రాణాలర్పించిన వాళ్ళ ప్రేమకి నిర్ఘాంతపోయాడు పరమశివం నివ్వెరపోయి నిల్చున్నాడు

"ఎన్నినాళ్ళకీ బ్రతుకు పండెనో

ఎక్కడో రేడియోలో మంద్రస్థాయిలో వినిపిస్తోంది.



# తెలుగోపనిషత్

తెలుగువాడికి ఒక ప్రత్యేకత వుంది. కొన్ని కొన్ని లక్షణాలను బట్టి ఎంత మందిలో వున్నా తెలుగువాడిని ఇట్టే పసిగట్టవచ్చు. ఉదాహరణకు

మీ దోవన మీరు పోతూండగా, ఎవడైనా వచ్చి, మీ చెయ్యి మెలిపెట్టి మీ వాచీలో టైము చూసుకుని వెళ్ళిపోతే, వాడు ఖచ్చితంగా తెలుగువాడే అయి వుంటాడు.

రోడ్డుకడ్డంగా నుంచుని కార్లు, సైకిళ్లు, రిక్షాలు, ఆవులు మొదలయిన వేటినీ లెక్క చెయ్యకుండా గంటల తరబడి రాజకీయాలు, సినిమాలు చర్చించే వాడు తెలుగువాడవడానికి సందేహం లేదు.

మీరు దినపత్రిక గానీ, మరో పత్రికగాని కొనీ కొనడంతోటే, "ఒక్క సారి చూసిస్తాను, పేపరిస్తారా?" అని అడిగి పుచ్చుకుని, తిరగేసి, నిర్లక్ష్యంగా మీమీద పడేసి చక్కాపోయేవాడు తెలుగువాడే

బస్సులో గాని, రైల్లో గాని ఆరుగురు కూర్చోవలసిన సీటులో నలుగురికి కూడా ఇరుకయ్యేట్టు కూర్చోగల నేర్పు ఒక తెలుగువాడికే వుంది.

తెలుగుదేశం గొప్పవాళ్ళకు మాత్రమే జన్మభూమి, వివరాలకు 1961నాటి జనాభా లెక్కలు చిత్తగించండి

అన్నట్టు అన్నిటికంటె ముఖ్యమైన లక్షణం తెలుగువాళ్ళని తిట్టిపోసి, అరవ వాళ్ళని, బెంగాలీ వాళ్ళను మెచ్చుకునేవాడు కూడా తెలుగువాడే.

— ఒక తెలుగువాడు

(1963 ఫిబ్రవరి జ్యోతినుంచి పునర్ముద్రితం)




**శ్రీ గిరి యోజనాల పర్యంతం పరివ్యాప్తమై ఉంది.**

ఉత్తుంగ గిరిశృంగాలు మబ్బుతునకల్ని ఒద్దాడుతున్నాయి.

పర్వత పాద పీఠికలపై పంచిన దుప్పటిలా ఉన్నాయి పచ్చిక మైదానాలు.

కొండచరియల మీది నించి జలజల జాలువారుతున్న సెలయేళ్ళు పడుచు పిల్లలవలె పరవళ్లు చేస్తున్నాయి కొండ కోనల్లో గుండెలవిసే కారుచీకటి క్రమ్ముకుంది గిరి శిఖరాలపై ఇంకా రవికాంతులు సోకుతున్నాయి నల్లని బండరాళ్ళు అరుణాంచితమయినాయి

పశ్చిమాద్రిలోకి దిగిపోతున్న సూర్యకాంతిలో శిలాశకలాలు సైతం పద్మరాగాలవలె కాంతులీనుతున్నాయి గిరి శిఖరాల మధ్య పులి కోనలో, ఆకాశాన్ని అంటుతున్న వృక్షాల మధ్య ఒదిగివున్న గుహలో రవ్వంత అలికిడి అయింది మరుక్షణమే విశ్రాంతి యోగానికి స్వస్తి చెప్పి ఒవాటున లేచి నిలబడిందొక బెబ్బులి

తల్లి పొదుగులో తలదూర్చి ఆదమరచి నిద్రిస్తున్న పులికూనలు ఉలికిపడి కళ్లు విప్పినాయి

అలికిడి వినిపించిన దిక్కుగా ఎర్రని చూపులు చూచింది పులి తల్లి భీకరంగా నోరు తెరచి ఆవురావురుమని ఆవులించింది కోరలు వజ్రాలవలె తర

శించినాయి. రక్త వర్ణంలో ఉన్న నాలుకను భయం కొలిపేలా బయటకు తీసి తల విదిల్చింది. ఒక్కసారి శరీరాన్ని కఠినతరంగా మార్చి ముందుకాళ్ళను మరింత ముందుకు చాపింది.

ఒక కాలు ఓరగా పైకి లేచింది.

పరిసరాలను పరికించి విరోధులెవరూ అత్యంత సమీపంలో లేరన్న నిర్ణయానికి వచ్చాక తల ప్రక్కకు త్రిప్పి పిల్లలవంక చూచుకుంది. దాని కనులలో మాతృత్వం తాలూకు మాధుర్యం తరళిస్తోంది.

గుర్రుగ చిత్రమయిన శబ్దం చేస్తూ బిడ్డల్ని సాదరంగా పలకరించి మీకు భయం లేదన్నట్లు మళ్ళా పడుకుంది బెబ్బులి. పులిపిల్లలు మళ్ళీ పొదుగులోకి మారినాయి.

పెదవుల మధ్య చన్మొనలు దట్టించి పాలు త్రాగుతున్నాయి. వాటి స్పర్శ సుఖాన్ని మాతృత్వ భావనతో అనుభవిస్తూ తన్మయురాలై పోయింది పులి తల్లి. అరుణ వర్ణాంచితమయిన దాని కన్నులు అర్థనిమీలితాలయినాయి.

తన్మయ భావంతో, ఏకాగ్ర ధ్యానంతో మాతృత్వపు మధురానుభూతుల్ని అనుభవిస్తూ ఆదమరచింది అది.

ఎంతసేపు అయాక చన్నులు చప్పరించటం మరచి చిరునిద్రలోకి జారుకున్నాయి చిరుతలు.

మాతృత్వమనేది మహనీయమయిన రక్షణ కవచంగా భావించి అవి ఆదమరచినాయి.

వేటగానికి అంతకుమించిన అదను ఏమున్నది. విధి అనే వేటగాడు వింటినారికి బాణం సంధించినాడు. అతనికి తరి లేదు, పిల్ల లేదు. వేటాడటమే వృత్తి.

తాను సృష్టించిన అందాల ప్రకృతిలో అపాయాలను పొంచిపెట్టటం ఆటని అనందం. అది విచిత్రంగానే కాదు క్రూరంగా కూడా ఉంటుంది.

ఒకొక్కప్పుడు ఈ సృష్టిని శిల్పీకరించిన అద్భుత శక్తులు ఎంత ప్రియగా వాటిని విధ్వంసం చేస్తాయో చూస్తే మనసు కలత అవుతుంది.

మెరిసే అందాల చారల పులి, దానికి కోరలు, క్రౌర్యం, పంజా విప్పితే పులిగోళ్లు, మళ్ళీ దానికి మాతృత్వం తాలూకు మహనీయమయిన భావనలు.

తల్లి పొదలో తల దాచుకున్న పులిపిల్లలు అమాయకత్వాని మారురూపాలు. అయినా వాటికి విధి సృష్టించిన భంగపాటు. గృహలో అలముకొన్న కారుచీకటి లోకి నిర్భయంగా, విధి సంధించిన బాణంలా దూసుకువచ్చిన ఆమె పేరు తుల్య భాగ. యక్షిణిల యింట ఆడపడచు.

పులుల్ని వేటాడటం, పులి పిల్లల్ని ఎత్తుకుపోవటం ఆమెకు క్రీడాప్రాయ మయిన విద్య పులి జాడలకోసం పగలంతా వెదికి వెదికి అలసిసొలసి ప్రొద్దు పశ్చిమాద్రికి చేరుతూ ఉండగా ఆ జాడల్ని ఆరా తీసుకున్నదామె.

అడుగు జాడలు ఆధారంగా రవంతసేపు నడిచి గృహ ముఖాన్ని చేరు కుంది అసలే అది పులికోన।

పులులు అధికంగా ఉండటంవల్ల దానికి ఆ పేరు వచ్చింది. ఆ ప్రాంతా లకు రావాలంటే అంతంతమాత్రపు యక్షులకయినా గుండెదిటవు చాలదు.

కృష్ణా తీరమంతా ఆవాసముంటున్న నాగయక్ష పుంద్రపుళింద గణాలలో నాగుల తరువాత యక్షులే సుప్రసిద్ధులు. శౌర్య పరాక్రమాలలో, సాహసంలో వారికి ఎవరూ సాటిరారు యువతీ యువకులు కొండకోన కొమ్మనించి మైదానాల మీదికి జలజలపారే సెలయేళ్ళవలె పరవళ్లు త్రొక్కుతూ కన్పిస్తారు

వేట వారికి ప్రధాన వృత్తి వ్యవసాయం ఉపవృత్తి చేవచచ్చిన వాళ్లు వ్యవసాయ వృత్తిలో తలమునక లవుతారు

తెల్లవారింది ప్రారంభంగా నిండుగా కండబలము, గుండెదిటవు కలిగిన యువతీయువకులు వేటకై వెళ్ళిపోవటం పరిపాటయిన విద్య

అలాగే వేటకని వచ్చిన తుల్యభాగ ప్రొద్దు వాటారిన వేళకు పులిజాడలు చూస్తూ గుహాముఖాన్ని చేరుకుంది. రవంత సేపు ఆలోచనగా ఆగిపోయింది. లోపలలో చీకట్లు అలముకున్నాయి. గుహాంతర్భాగం కాటుక రాసిపోయినట్లు అయిపోయింది లోపలకు పోతే ఏమీ కన్పించదు. పైగా అక్కడ ఎన్ని పులు లున్నాయో ఊహించటం అసాధ్యం అందుచేత ముందుకుపోవటం దుస్సాహస మనిపించిందామెకు

వెనుకకు మరలిపోవటం పిరికితనంకూడ అవుతుంది. అందుచేత రెక్క ట్టి పులిని వెలుపలకు రప్పించాలని నిర్ణయించుకుంది తుల్యభాగ

అనుకున్నదేమి? ఆలస్యమెందుకు జరగాలని వెంటనే నోటికి చేయి

అడ్డుగా ఉంచుకుని రిక్క కొట్టింది ఆ కూత వింటోనే అనుమానపు తెరల్ని మరచి ఆదమరచి కనులు అర్ధనిమీలితం కవించిన పులి పిల్లి కనులు విప్పింది

కాటుకవంటి చీకటిలో దాని కన్నులు పౌరుషంతో ఎర్రగా నెగళ్ళవలె మండుతున్నాయి విచ్చిన మందారాలవలె అరుణకాంతులను విరజిమ్ముతున్నా

అలికిడి అయినా ఆదమరచి నిద్రించినందుకు తనను తానే నిందించుకున్నట్లు గుర్రు మన్నది పులితలి తోక త్రొక్కిన త్రాచులా చివాలున లేచి నిలిచింది

ఆ అదరుపాటుకు పులిపిల్లలు దూరంగా వెళ్ళి నిలిచాయి విరోధులెవరో తన ఆవాసాన్ని ఆనాకే తీసి పుట్టడించినారని దానికి క్రోధమయిపోయింది.

పౌరుషంతో విపశమయింది నరాలలో వేడినెత్తురు మరగించిన తైలంలా ప్రవహించి శరీరాన్ని మండించింది పంజా విప్పి కాలు ముందుకు చాచి ఏ క్షణంలో అయినా ముందుకు దుమికేందుకు సిద్ధంగా నిలబడింది.

గుహాముఖం దగ్గర నిలిచిన తుల్యభాగ మనసు తొందరించింది. రిక్క వేసినా వెలుపలకురాని బెబ్బులి చేవచచ్చినదో, సిగ్గుమాలినదో అయివుండాలని ఆమెకు అనిపించింది

పౌరుష పర్యాయమాలకు బెబ్బులులే పెట్టింది పేరు. రిక్కవేస్తే దాని ప్రతిధ్వనిలా బెబ్బులి గాండ్రింపు రావటం ఆమెకు తెలుసు కాని యిలా రుద్రాక్ష పిల్లిలా నక్కి దాక్కోవటం ఆమెకి క్రొత్త ఇంత సిగ్గుమాలిన బెబ్బులి ఆ జాతికే కళంకం. దాని బ్రతుకనిస్తే బెబ్బులుల పరువు ప్రతిష్టలు కళంకిత మవుతాయి. ఈ పులిని వధించి తీరాలి అని నిర్ణయించుకున్నదామె తిరిగి నోటికి చేయి అడ్డుగా ఉంచుకుని రిక్కవేసింది

అప్పటికే సంసిద్ధురాలై పోయి, ఏ రిక్క అంచి శబ్దం వస్తుందా అని ఆవురావురుమంటూ ఎదురుచూస్తున్న పులి తలి గుహాంతర్భాగంలోని మరో గుహలో నోరు తెరచి పెదబొబ్బ పెట్టింది రిక్కవేసిన తనకు ప్రథమ పర్యాయం బదులివ్వనందుకు అది చేవచచ్చినదో, సిగ్గుమాలినదో అని భావించిన తుల్యభాగ ఈసారి ఒంటి మీదికి తెలివి తెచ్చుకుంది

అప్రమత్తురాలై ఆయుధంమీదికి చేయి పోనిచ్చింది. అప్పటికే ఆకాశం అంచుల్లో నిండిన చీకటి తెరల మాటునుంచి దూసుకువచ్చిన ఉల్కలా వచ్చి



పడింది బాలింతరాలయిన పులితల్లి  తన ప్రత్యర్థి అయిన తుల్యభాగను గుర్తించి మరొక మారు గుహలో నోరు తెరచి, వజ్రాలవలె దవళవర్ణం కాంతు లీనుతున్న కోరల్ని బహిరంగపరచి గాండ్రించింది

ఉల్కవలె దుముకుతున్న దాని పరవళ్లు పసందుగా అనిపించినాయి తుల్యభాగకు. రవంత జాగుచేసినా ఆడపొడిమి కలిగిన బెబ్బులివి కన్పించినావు. ఇక నాకు చేతినిండా పని  కండల తీటతీరా నీతో కలియబడతాను" అంటూ అడుగు ముందుకు వేసింది తుల్యభాగ

బెబ్బులి ఎత్తయిన రాతిమీదకు గెంతి మూడు కాళ్ళమీద నిలిచింది  ఏ క్షణంలో అయినా అది పైకి రావచ్చు  దాని పరవళ్ళు, గాండ్రింపు కనిపించే కండ బలిమిని గమనించింది తుల్యభాగ.

అంతట శక్తిసంపన్నమైన బెబ్బులి  రిక్కవేసి బాగా కవ్వించి కసిగొలిపితే ఎంతో దూరంవరకూ ఎంత వేగంగా ఉరకగలదో ఊహించేందుకు ప్రయత్నించిందామె

అరక్షణం ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చింది. వెంటనే మూడడుగులు వెనుకకు వేసి  ప్రక్కకు తప్పుకునేందుకు దారి సరిగా ఉన్నదో లేదో చూచుకుని ఆయుధాన్ని అప్రమత్తంగా పిడికిలిలో బిగించి పట్టుకుని "కువ్వా"న కుం

వేసిందామె

ఆ రిక్కతో కోపవివశంగా మారిన బాలెంతరాలు బెబ్బులి మూడు కాళ్ళతో బండరాతిని తన్ని ముందు పంజాలు విప్పి గగన మార్గానికి లేచింది. మబ్బుల నించి నేలకు రాలుతున్న పిడుగులా గర్జించింది. ఆకాశ పాతంలా ఉరుకుతున్న బెబ్బులి ఏ చోటకు రానున్నదో ఊహించి రవంత ప్రక్కకు మెరుపులా ప్రాకింది తుల్యభాగ. బాలెంతరాలయిన బెబ్బులి ప్రయత్నం విఫలమయింది

తాను లక్ష్యాన్ని గురిపెట్టి దుమికినా అది మెరుపులా ప్రక్కకు తప్పుకోవటం దానికున్న శక్తిసంపన్నత తాలూకు అహంకారాన్ని బాగా రెచ్చగొట్టింది

మరొక మారు దిక్కులు పిక్కటిల్లేలాగ, కొండమీది బండరాళ్లు అదిరి దొర్లిపడేలాగ, పిరికిగుండెలు పెల్లున పగలిపోయేలాగ పడబొబ్బ పెట్టింది అది.

దాని పెడబొబ్బలు యక్షుల యింట రక్తాన్ని పంచుకుపుట్టిన తుల్యభాగకు కేవలం క్రీడా వినోదంగా విన్పించినాయి. ఆమె రవంత అయినా చలించలేదు. రాకాసి కోరల్ని చూసి విచలిత అయిపోలేదు. ముఖంమీదికి మందహాసం తాలూకు వెలుగులు ప్రసారితమయినాయి

మెరుపులా మరొక ఉన్నత శిలాశకలం మీదికి ఎక్కి "కువ్వ"న కూత పెట్టి రిక్క కొట్టింది ఆమె

ఆ కూత వింటే బెబ్బులులకు కంగారు కోపం కొండలా పెరిగిపోతుంది. రక్తం మరిగించిన తైలంలా అయిపోతుంది

కువ్వుమన్న కూతకు ప్రతిధ్వనిగా గాండ్రించింది బాలెంతరాలు బెబ్బులి. ప్రత్యర్థిని ఓరగా, కోరగా, రుచిమీరగా చూచుకుంది. 'నన్నింతగా అలయించిన మానవ మాంస ఖండమా! నీ కంఠనాళాలను నా కోరలతో కొరికి రక్తాన్ని కడుపునిండా త్రాగుతాను. నీ రక్త విహీనమయిన శరీరాన్ని చిన్నిచిన్ని మాంస ఖండాలుగా చీల్చి నా బిడ్డలకు విందుచేస్తాను' అన్నట్లుగా చూచింది. ఆమె మీదికి పోయేందుకు ఈసారి గురితప్పని కోణాన్ని నిర్ణయించుకుంది.

ప్రథమ పర్యాయమైతే సుళువుగా పైనించి కిందికి దూకిందది. ఈ పర్యాయం ఎర ఎత్తుమీద ఉంది తాను పల్లంలో ఉంది అయినా అది రవంత నిరుత్సాహపడలేదు.

సరిగా లక్ష్యాన్ని నిర్ణయించుకుని తుల్యభాగ మీదికి రెక్కలు మొలిచిన గరుడపక్షిలా లేచింది బెబ్బులి. అది నిర్ణయించుకున్న కోణం వాటలో అనుభవ

పూర్వకమయినది.

అది పైకి లేచి తనమీదికి వాలే లోపుగా రవంత ప్రక్కకు ఒత్తిగిల్లి దాన్ని అలయించాలని ప్రయత్నించింది తుల్యభాగ. కాని ఈ పర్యాయం ఆమె ప్రయత్నం విజయవంతం కాలేదు ఖచ్చితమయిన కోణాన్ని నిర్ణయించుకున్న బాలెంతరాలు బెబ్బులి పంజా విప్పి కొట్టగలిగిన పరిధిలోనే చిక్కడిపోయిందామె.

కఠినతరమయిన గోళ్లు ఆమె శరీరంలో దిగినాయి. బాధగా కెవ్వుమని అరచించి తుల్యభాగ శరీరం అందినమేరకు చిరిగి చీలికలయిపోయింది. రక్తం ధారాపాతమయింది

నల్లని కొండల మీదినుంచి దూకే ఎర్రని నీరులా తుల్యభాగ శరీరం మీద రక్తం ప్రవాహసదృశంగా కారిపోసాగింది ఆమె రక్తాన్ని చూడగానే కోపంతో కనులు ఎర్రవారినాయి రక్తపు జీరలు నిండిన తుల్యభాగ కనులు కింసుక పుష్పాలవలె కరిశించినాయి

ఉక్కు పిడికిలిలా బిగుసుకుపోయిన పిడికిళ్ళలోని ఆయుధాన్ని మరింతగా బిగించి పట్టుకుంది పౌరుషంతో ప్రతీకారంలో ఊర్పులు దీర్ఘతరాలయినాయి. రుద్రమూర్తి అయింది తుల్యభాగ.

తొడ చరిచి ద్వంద్వయుద్ధానికి తలపడినా, ఆయుధాన్ని చేతపట్టి ఏ క్రూర జంతువుపై రిక్కవేసినా ఎదురుపడి పోరాడిన యక్ష యువకుడు కాని, ముందు కొచ్చి దెబ్బతీసిన క్రూరమృగం కాని అంతవరకు తారసపడలేదు. ఇప్పుడే బెబ్బులి శరీరాన్ని రక్తసిక్తం చేసింది.

అదయినా తొలిసారి గుహముఖాన నిలచి రిక్కవేసినప్పుడు బదులుగా గాండ్రించలేమి అందునించి చేవచచ్చినదో, సోమరిదో అనుకుంది తాను. అటు వంటి ఆలోచన రవంత ఆలసత్వానికి కారణమయివుండవచ్చు.

అదే ఇప్పటికి ఇలా గాయపడేలా చేసింది.

తొలి విడత దాడిలో ప్రత్యర్థి మిగిలినా రెండవతూరి తాను తన ఎరను గాయపరచటంతో బెబ్బులి మరింత ఉత్సాహాన్ని పొందింది. ఆ శరీరాన్ని గాయపరిచి పక్షిల్యాల మీద వాలింది. తిరిగి నాలుగు కాళ్లు నేలమీదికి వాలాక మళ్లీ శరీరం శక్తి సంపన్నమయి ఎగిరేందుకు ఉత్సహించింది.

గురితప్పక ఎరను కొట్టి రక్తనాళాలు కొరికి రక్తం పీల్చి, మాంస ఖండాలను ముద్దుకూనలకు కానుక ఇచ్చేందుకు సమయం ఆసన్నమయిందని భావించింది బెబ్బులి.



అరక్షణమయినా ఆలస్యం చేయకుండా తిరిగి గాలిలోకి లేచింది. ఈసారి దాని ప్రయత్నం కొనసాగనివ్వలేదు తుల్యభాగ.

పులులతో ద్వంద యుద్ధానికి తలపడటమంటే మాటలుకాదు. వాస్తవానికి క్రౌర్యంలోనూ, వేటవిధానంలోనే కాక శారీరక శక్తి సంపన్నతలో కూడ మనుషులకన్నా అధికమయినవి బెబ్బులులు. ముఖాముఖి ఎదుర్కొంటే మనిషి పోరాడగలిగిన సమయంకంటే ఎక్కువసేపు అవి పోరాడగలవు

అందునించి నిపుణులయిన వేటగాళ్లు ముఖాముఖి ఎదుర్కోనటం తప్పని సరయినప్పుడు ముందుగా దాన్ని అలయిస్తారు.

మనిషి బుద్ధిగతమయిన ప్రాణి.

అందునించి ఎదుట నిలిచి భయపడకుండా ఉండగలిగితే దాన్ని అల యించటం అంత కష్టసాధ్యమయిన పనికాదు. తుల్యభాగలా గాక దాని ఎరకు దొరుకుతూ సమయానికి ప్రక్కకు తప్పుకోవచ్చు. దాన్ని అలా కొన్నిమార్లు ఉరకలు వేయిస్తే అది అలతపడి శక్తిసంపన్నత హీనమయిపోతుంది.

ఆ ప్రయత్నంలో రెండవసారి తాను గాయపడినందుకు తుల్యభాగ సిగ్గు పడింది. తాను భావించినట్లుగా అది చేవచచ్చినది కాని, సోమరికాని కాదని తెలుసుకుంది.

మరింత జాగ్రత్త వహించి ఈసారి తప్పుకుంది అంత ఎత్తున గాలిలోకి లేచిన బెబ్బులి దబ్బున నేలమీదికి పడిపోయింది. వక్షోభాగం ఒకటి బండరాయిని తాకి గుండెలు అవిసినాయి.

బెబ్బులి అలతపడింది. దాన్ని అలత తీర్చుకోనిస్తే అది తిరిగి శక్తి

సంపన్నురాలయిపోతుంది. పోరాటంలో వినూత్నమయిన ఉత్సాహంతో పరాక్రమిస్తుంది. అందునించి దానికి అటువంటి అవకాశ మివ్వలేదు తుల్యభాగ.

తాను మెరుపులా దూరంగా మరొక బండిరాయి మీదికి లంఘించి వెంటనే రిక్క కొట్టింది. గుండెలనిండా గాలి పీల్చి తగిలిన దెబ్బనుంచి తేరుకుంటున్న బెబ్బులి రిక్క వింటూ వింటివిడిచిన బాణంలా చివాలున లేచింది.

కోపవివశంగా పల్లంనుంచి ఎరమీదికి మళ్ళా లంఘించింది. తుల్యభాగ మరలా తప్పుకుంది.

బాలింతరాలయిన బెబ్బులికి ఈసారి శిరోభాగాన శిలాశకలం తాకి రవంత గాయంకూడ అయింది.

దానికి కన్నులు మూతపడినాయి. రవంతసేపు శరీరంమీద తెలివి తప్పినట్లుగా అయిపోయింది.

అటువంటి ఉదనుకోసమే ఆశతో ఎదురుచూచిన తుల్యభాగ చేతిలోని ఆయుధాన్ని దానిమీదకు విసిరింది.

దాని డొక్కలో మరొక గాయమయింది. తలనించీ, తుల్యభాగ ఆయుధంతో చేసిన గాయంనించీ రక్తం కారసాగింది. బెబ్బులిలో కోపమూ, ప్రతీకారమూ ఇబ్బడిముబ్బడి అయినాయి.

ఈసారికూడ మరొక ఎత్తయిన రాయిమీదకి ఎక్కి రిక్కకొట్టింది తుల్యభాగ. కారిపోతున్న రక్తధారలనుకానీ, తల్లి దుస్థితిని చూచి కంట నీరుపెడుతూ అల్లంతదూరంలో నిలచిన తన బిడ్డలుకానీ దానికి ప్రాణం రక్షించుకోవాలన్న స్పృహ కల్పించలేకపోయినాయి. రిక్క కొట్టిన ఎరను ఎర్రగా చూచింది అది.

హీనమయి పోతున్న శక్తిని సమీకరించుకుని తనకన్నా ఉన్నతమయిన శిలాశకలంమీద నిలిచిన ఎరమీదికి దూకింది బెబ్బులి. అప్పటికా శక్తిహీనమయిన దాని వేగం తుల్యభాగ ప్రదర్శించిన మెరుపువేగం ముందు విఫలమయిపోయింది.

యక్షయువతి క్షేమంగా ప్రక్కకు తప్పుకుంది. బెబ్బులి శరీరం శిలా శకలాన్ని తాకింది. తలకు మరొక గాయమయింది. దాని శారీరక శక్తులు సన్నగిల్లిపోవటం ప్రారంభించినాయి. తనకు ఈ మునిమాపున ఎదురయిన స్థితిని తలచుకు. దురపిల్లసాగింది బెబ్బులి. నోరు గుహలా తెరుచుకుంది.

నాలుక ఎర్రఎర్రగా బయటకు జారింది. గుండెలు అలసటనించి ఎగసిపడుతున్నాయి. క్షతగాత్రమయినందునల్ల కలిగిన దాహం ఇప్పటిలో తీరే దారిలేదు.

# ఉగాది వసంతపు పూతలా ఆప్కో కురిపిస్తుంది రంగుల నేతలు



ఈ నూతన సంవత్సర వేడుకను
ఆప్కో వారి సున్నితమైన,
బిగువైన అద్దకాలతో జరుపుకోండి.
తాజా పుష్పాలు వెద జల్లేటి
వివిధ డిజైన్ల చీరలు, షర్టింగులు,
డ్రెస్ మెటీరియల్స్, రెడీమేడ్
దుస్తులు, గృహాలంకరణ వస్త్రాలు.
కొనుగోలుదారులందరికి
ఆప్కో వారి ఉగాది శుభాకాంక్షలు.






kiron anco/83u

వాలిపోతున్న రెప్పల్ని బలవంతంగా పైకి లేపి తల్లి దురవస్థకు దురపిల్లు తున్న కూనలవంక చూచుకుంది 'తల్లీ! నీవు త్వరగా విజయురాలువై తిరిగిరా! నీ పొదుగులో తలదాచుకుని సుఖంగా నిద్రించే అవకాశం మాకు కల్పించు' అన్నట్లుగా దీనంగా చూస్తున్నాయి అవి. బెబ్బులి నేత్రాలు జలమయినాయి.

దాని మాతృ హృదయం క్షోభించింది. తను ఒకవేళ ఈ పోరాటంలో ప్రాణాలు విడిస్తే బిడ్డలగతి ఏమవుతుంది? బెబ్బులి వ్యధాకులితంగా కూనలవంక చూచుకుంది.

ఒక్కసారి వాటిదగ్గరగా వెళ్ళి శరీరాన్ని నాలుకతో తడపాలని, పొదుగులో దూరి అవి పాలుత్రాగే నెపంతో కుమ్ముతూ ఉంటే మాతృత్వం తాలూకు మహనీయమయిన తన్మయానుభూతిని మరొకమారు పొందాలని దాని అంతర్యం ఆకాంక్షతో నిండిపోయింది. రెప్పవేయక కూనలవంక చూచుకుంది బెబ్బులి.

అప్పటికే ఆలస్యం జరిగిపోయింది. అలసిపడిన బెబ్బులి ఆయాసం తీరితే మళ్ళా విజృంభిస్తుంది.

తుల్యభాగ ఎత్తయిన రాయిమీదినించి తిరిగి రిక్క కొట్టింది. అదివింటూనే పులితల్లి లేచి నిలిచింది. తాను ఉన్నదస్థితిని అది క్షణంలో మరచిపోయింది.

చివరిసారిగా కూనలకు వీడ్కోలు చెప్తున్నట్లు వాటివంక చూచుకుంది. గావుమని గాండ్రించి రిక్కకు బదులుచెప్పింది.

దానిని మరింత రెచ్చిపోయేలా కువ్వుమని కూతపెట్టి పోరాటానికి ఆహ్వానించింది తుల్యభాగ.!

అంతే!

పరాక్రమమే పరమార్థంగా ఆ పరిసరాలను ఏలుకొంటున్న కాలింతరాలు బెబ్బులి లేచింది

కనులనించి కారే కన్నీటిని కాని, శరీరంనించి ప్రవహించే రక్తధారలను కానీ, తలికోసం ఆక్రోశించే బిడ్డలవేడికోళ్ళు కాని అది సరకు చేయలేదు.

మహాపద్మ సర్పాల పడగను తప్పిన ఖగేంద్రం లాగా రివ్వున గాలిలోకి లేచింది. ఎరమీద గురిపెట్టి ముందుగా పంజాదెబ్బ కొట్టింది. అందినమేరకు తుల్యభాగ నీలతను కాంతి అరుణారుణంగా అయిపోయింది. కాని అప్పటికే బెబ్బులి గురిపెట్టిన చోటునించి తప్పుకున్నదామె. బెబ్బులి తల రాతిని తాకింది

వివశంగా అది పడిపోయింది. మరి కదిలేందుకు శక్తి చాలలేదు. వేటలో

అదను ఎరిగిన తుల్యభాగ ఆయుధాన్ని బిగించి పట్టుకు దానిమీదకు ఉరికింది

బాలింతరాలయిన బెబ్బులి ఉదరభాగంలో కసిదీర ఖడ్గ ప్రహారం చేసిందామె బాధగా మూల్గి కడసారి బిడ్డలను కంటచూచుకుంది బెబ్బులి తల్లికి సంప్రాప్తమయిన దురవస్థను దురపిల్లుతున్న కూనలు దాని ఆర్తనాదం విని అదిరిపడినాయి

గుర్రున రోదించి తమకింక మరెన్నడు దొరకని మాతృస్తన్యం కోసం పరుగుపరుగున వచ్చినాయి. అప్పటికే బెబ్బులికి శ్వాస శాంతమయిపోయింది కనులు చిరవిస్మయంగా అర్ధనిమిలితాలు అయినాయి. కంటిపాప చలనం స్థంభించిపోయింది

చైతన్యధార పరిసమాప్తమై దాని శరీరం నిర్జీవమయిపోయింది

ప్రత్యర్థిమీద పగతో ప్రతీకారంతో మరగించిన తైలంలా రక్తనాళాలలో ప్రవహించే వేడినెత్తురు గడ్డకట్టిపోయింది.

తల్లిపొదుగులో తలదూర్చి క్షీరధారలకోసం ఆశించిన పులిపిల్లలు దీనంగా రోదించినాయి. అమ్మ పొదుగులో ఆకలితీర్చే క్షీరధారలు ఎంతకూ కదలిరాలేదు

కనీసం కన్నతల్లి ఆయినా కన్నువిప్పి చూడలేదు పంజాతో ఉదరభాగాన రాచినా చలనం లేదు. ముఖానికి ముఖం ఆనించినా ముచ్చటపడిపోవటంలేదు

తల్లికి ఏదో తీరని దుర్దశ సంప్రాప్తమయిందని అవి గ్రహించినాయి కళేబరం చుట్టూ భక్తిప్రవృత్తులతో ప్రదక్షిణలు చేస్తున్న వాటివలె గురగుర లాడుతూ నిస్సహాయంగా తిరుగసాగినాయి

ప్రత్యర్థి అయిన బెబ్బులిని చిత్తుచిత్తు చేసానన్న ఉత్సాహంతో విజయ గర్వంతో ఎర్రని ఆయుధం వంక చూచుకొంటోంది తుల్యభాగ పులిపిల్లల దీన రోదనం ఆమె కర్ణపుటాలను తాకింది

తల ఎత్తిచూచి కన్పించిన దృశ్యానికి కరుణతరంగిత అంతరంగ అయిపోయింది యక్షయువతి

దూరమయిపోయిన తల్లిని తలుచుకుని దురపిల్లుతున్న పులిపిల్లల్ని చూచి ఆమె కరుణసింధువు అయిపోయింది

ఇంకా తాను అందుకోలేని ఆ మాతృత్వ మహదాకాంక్షనించి వంచిత లయిపోయిన బిడ్డలు ఆమెను కరగించినాయి.

జాలిజాలిగా వాటిని చేతుల్లోకి తీసుకుంది యక్షయువతి తుల్యభాగ!

# 2

అలముకున చీకటిలో అలవాటయిన అడవిదార్లవెంట మును ముందుకు సాగుతోంది తుల్యభాగ.

చేతుల మధ్య ఇరికించుకున్న పులికూనలు తత్తర చూపులు చూస్తున్నాయి. అడవి వృక్షాలనించి సాగివచ్చే చల్లనిగాలి చెంపల్ని తాకి గిలిగింతలు పెడుతోంది కృష్ణాతీర పరిసర ప్రాంతాలన్నీ నాగ యక్ష పుండ్ర పుళింద జాతుల గణాలు పరివేష్టించి ఉన్నాయి.

వారి ఆవాసాలు అప్పటికే నగరాలుగా రూపొందినాయి. తుల్యభాగ ఆవాసముంటున్న ఊరు వజ్రాల దిన్నెకు పశ్చిమంగా పది యోజనాల దూరంలో ఉంది అక్కడ ఉన్నవారంతా యక్షులే।

పరిసర ప్రాంతాలలో కొన్ని చోట్ల నాగజాతీయు లుంటున్నారు వారికీ వీరికీ ఎడతెగని మైత్రీభావం. ఆచార వ్యవహారాలను అనుసరించి యక్షులు గోత్రాహ్వులయిన ఆర్యరాజులను పోలి ఉంటారు నాగులు ద్రావిడ గణాలు.

చిమ్మచీకటి అలముకున్న తరవాత గ్రామంలో మధ్యగా వెలిగించిన నెగడులో కర్రముక్కలు కాలి బూడిద అయినాయి కణకణ మండే చింతనిప్పులు కొన్ని ఇంకా మిగిలి ఉన్నాయి.

ఆ ఊరిలోని యువతీ యువకులలో కొందరు ఇంకా నెగడు విడిచి పోలేదు. రెల్లుతో కప్పిన వలయాకారపు గృహాలు కొన్ని ఒక వలయంగా నిర్మించబడినాయి.

ఆ వలయాకృతి మధ్య విశాలమయిన మైదానం ఉంది. దాని మధ్యలో నెగడు వెలుగుతుంది. పగలంతా వేట పనిలోనూ వ్యవసాయపు పనులలోనూ అలసి సొలసి ఇంటికి చేరిన యక్ష జాతీయులు చలి కాచుకుందుకు నెగడు దగ్గిర చేరుతారు. తాము వేటాడి తెచ్చుకున్న జంతువును చీల్చి చీకులుగా కాల్చుకు తింటారు.

వేటాడి తెచ్చిన లేళ్లు, చెవుల పిల్లలు, కణుజులు అందరూ సమంగా పంచుకుంటారు ఆ రాత్రి విందారగించటం అప్పటికే పూర్తి అయిపోయింది.

(సశేషం)

# ప్రణయ వీచికలు

మూలం
బార్బరా కార్ట్‌లాండ్
స్వేచ్ఛానువాదం
వాసిరెడ్డి సీతాదేవి




(జరిగిన కథ)

(నిశిరాత్రి సూయజ్ కెనాల్‌లో పడవ పైనుంచి సముద్రంలోకి దూకబోయింది ఓ యువతి. ఆత్మహత్యని నివారించాడు ఓ వ్యక్తి. ఆమె పేరు సీత. భారతదేశంలో పుట్టిన విదేశీ యువతి. బాబాయి హార్వే దగ్గర పెరుగుతోంది తలిదండ్రులు లేకపోవడంతో. హార్వే సీతని మానసికంగా శారీరకంగా బాధపెట్టేవాడు. తన కథ చెబుతోంది సీత.)

(జరుగుతున్న కథ)

**అతని కోపం అంతా తనమీదే కాదనికూడా తనకు తెలుసు.** తను ముసలివాడు అయిపోతున్నాననే బాధ అతన్ని వేదించేది వయసులో తను ఇండియాలో అనుభవించిన అధికార దర్పాన్ని మననం చేసుకొంటూ, ఇప్పుడు అలాంటి జీవితం గడపలేనందుకు బాధపడేవాడు రోజురోజుకూ అతనిలో ఉన్న మానవత్వం చచ్చిపోసాగింది.

తను వంటరివాడిననీ, తను కావాలనుకొనేవారు లేరనీ కృంగిపోతూ ఉంటాడు. అందుకే అందుబాటులో ఉన్న తన మీద, అతను ప్రపంచంమీద ఏర్పడిన కసిని తీర్చుకుంటున్నాడు

అనుకోకుండా అతనికి హైదరాబాద్ నవాబు నుంచి ఆహ్వానం అందింది ఒక క్లిష్టమైన కేసులో అతని సలహాను కోరాడు నిజాం నవాబు అతను హైదరాబాద్‌లోనే ఉద్యోగ విరమణ చేశాడు నవాబు ఆహ్వానం అందుకోగానే అతని ఆనందం పెల్లుబికింది.

"నాకు తెలుసు ఎప్పటికైనా ఇలాంటి ఆహ్వానం వస్తుందని నా అంత తెలివైనవాడు, న్యాయశాస్త్రంలోని మెళుకువలు తెలిసినవాడూ, ఆ సంస్థానంలో మరొకడు లేడని నాకు తెలుసు" అన్నాడు హార్వే

రెండురోజులు చిన్న పిల్లవాడిలా నవ్వుతూ కావాల్సిన పుస్తకాల బూజు దులిపాడు. ఇండియా నుంచి వచ్చాక బీరువాలో పడేసిన దుస్తుల్ని కూడా బయటకు తీశాడు.

"మీరు ఇండియా వెళ్ళిపోతే ఇక్కడ నేను ఉండాలా అంకుల్?" అని తను ప్రశ్నించింది

"ఇక్కడ ఉండక ఇంకెక్కడి కెళ్తావ్?" అన్నాడు తన ముఖంలోకి చూస్తూ.

ఆ మాట అన్నాడు. కాని వెంటనే ఆలోచనలో పడ్డాడు బహుశా ఇండియాలో కొత్తవాళ్ళతో బాధ పడేకంటే తనను తీసుకెళ్ళడమే మంచిదని భావించి ఉంటాడు.

"నో! నువ్వు నాతో వస్తావు కొన్ని సంవత్సరాలుగా నీమీద ఖర్చు పెట్టిన డబ్బు అక్కడ నీద్వారా సంపాదించుకుంటాను"




ఆ మాట వినగానే ముందు తనకు సంతోషం కలిగింది. తన తల్లిదండ్రులు ఇండియా గురించి ఎన్నో విషయాలు చెబుతూ ఉండేవారు. తనకు ఇండియా చూడాలని ఉన్నది కాని తన బాబాయితో ఎక్కడికి వెళ్ళినా తనకు నరకం తప్ప దని తెలుసు అందుకే ముందు కలిగిన సంతోషం నీరుకారిపోయింది మరు క్షణంలోనే!

ఓడలో ఆతను రాస్తున్న స్క్రిప్టుకు ఫెయిర్ కాపీ చెయ్యసాగింది తప్పు దొర్లినప్పుడల్లా తిట్లూ, దెబ్బలూ తింటూనే ఉంది.

సముద్ర ప్రయాణంలో తను జబ్బుపడలేదు. కాని తలనొప్పి మాత్రం తరచుగా వస్తోంది తనకోసం అన్నిటికంటే చౌకగా ఉన్న చిన్న కాబిన్ రిజర్వ్ చేయించాడు సాధారణంగా ఫస్టుక్లాసు ప్రయాణీకుల పనివాళ్ళకోసం ఆ క్యాబిన్‌సు ఇస్తుంటారు.

అందులో ప్రవేశించినప్పుడల్లా తనకు ఒక సమాధిలోకి వెళ్తున్నట్టుగా ఉంటున్నది వెలుగు సరిగా ఉండదు రాత్రిళ్ళు ఆ గుడ్డివెలుగులోనే ఫెయిర్ రాస్తూ ఉంటుంది అందవల్లనే కళ్ళు పీకడం. తలనొప్పి రావడం జరుగుతోంది. ఇంతచేసినా ఉదయం తన బాబాయి "ఇంతేనా రాత్రి రాసింది?" అంటూ విసుక్కుంటాడు.

మెడిటెరేరియన్ వదిలి సూయజ్ కెనాలులో ప్రవేశించేసరికి తను ఏ పనీ చేసే స్థితిలో లేదు. బంక్‌లో పడుకోవటం మినహా.

"నీమీద నాకెంత ఖర్చు అవుతుందో ఈ ప్రయాణంలో తెలుసా? సోమరి తనం మానేసి పని సరిగ్గా చెయ్యి ఆ మాన్యుస్క్రిప్టు ఇండియా చేరేలోపల పూర్తిచెయ్యాలి. చెయ్యకపోతే ఫలితం అనుభవిస్తావ్" అని బాబాయి బెదిరించాడు.

"ఇక నావల్ల కాదు అంకుల్" అంది

అతను ముఖంమీద ఈడ్చికొట్టాడు.

"నువ్వు చేసి తీరాలి. ఎలా చేయించాలో నాకు తెలుసు లేకపోతే నిన్ను సముద్రంలోకి విసిరేస్తాను" అంటూ బాబాయి అరిచాడు

ఆ తర్వాతే తను ఈ నిర్ణయానికి వచ్చింది అతను చేస్తానని బెదిరించిన పని తనే చేసుకోవాలనే నిర్ణయం తనకు కలిగింది

ఆ రాత్రి, పగలూ బాగా ఆలోచించే, ఇక బాబాయి పెట్టే బాధలు భరించే కంటే, ఆత్మహత్యే మేలుగా తను భావించింది

ఓడలో ఉన్న ప్రయాణీకులందరూ నిద్రలో ఉండగా, ఇతనొక్కడే ఎందుకు మేల్కొని ఉన్నాడో?

కొద్ది క్షణాలు గడిచాక- "నువ్వు ఇండియన్‌వనినాకు నమ్మకంగా లేదు." బెరుకు బెరుగ్గా అన్నది,

అతను నవ్వాడు. కళ్ళలో మెరుపు కన్పించింది.

"నువ్వు నాగురించి తెలుసుకోవాలనే ప్రయత్నం నాకిష్టం లేదు".

"ఎందుకని?"

"దానికి కారణాలున్నాయి నాగురించి అడగనని నువ్వు వాగ్దానం చెయ్యాలి. నువ్వు అలా చేస్తావనే నా నమ్మకం."

"అలా చెయ్యకపోతే," అంతకుముందు లేని ధైర్యం ఆమె మాటలో కన్పించింది.

"అలా అయితే – మీ బాబాయికి నీగురించి చెప్పాల్సి వస్తుంది"

అందుకు సీత ఖంగా పడింది.

"ఇలాంటి ఆలోచన నీకెలా వచ్చింది? నన్ను ఉడికించడానికి అంటున్నావో, బ్లాక్‌మెయిల్ చెయ్యడానికి అంటున్నావో నాకు అర్థంకావడం లేదు"

"నువ్వేమన్నా అనుకో. నా విషయం మాత్రం నువ్వెవ్వరికీ చెప్పకూడనిది బయటికి పొక్కకూడనిది"

కళ్ళు పెద్దవిచేసి చూసింది.

"నువ్వు మారువేషంలో ఉన్నావ్"

"ఏమన్నా అనుకో. నానుంచి నీ ప్రశ్నకు సమాధానం దొరకదు."

"మరి నువ్వు నాగురించి చాలా అడిగావు "

"అది వేరు నా విద్యుక్త ధర్మాన్ని నేను నిర్వహిస్తున్నాను నువ్వు నీ కర్తవ్యాన్నుంచి పారిపోతున్నావు "

ఆమె సన్నగా నవ్వింది

ఆమె ఆ సమయంలో ఇంకా చిన్నదానిలా కన్పించింది

"సరే నువ్వే గెల్చావు - ఒకవేళ "

"ఎట్టి పరిస్థితుల్లోనూ, మళ్ళీ ఆత్మహత్య చేసుకోనని ప్రమాణం చెయ్."

ఆమె నిటారుగా కూర్చుంది

తను ఈ బాధల్ని భరిస్తూ ఎలా బ్రతకగలదు?

అతను కొంచెం ముందుకు వంగి, ఆమె చెయ్యి పట్టుకొని అన్నాడు—

"జీవితం ఎంతో విలువైనది ఎన్నో మధురానుభూతులు చవిచూడవలసిన దానివి "

"ఏమో!" నిస్పృహగా అన్నది

"నువ్వు చిన్నదానివి. ఎంతో భవిష్యత్తు నీకున్నది మంచిరోజులు రాక పోవు. నామాట నమ్ము" అన్నాడు అతను

ఆమె వేళ్ళు అతని చేతిమీద గట్టిగా బిగుసుకున్నాయి

"నేను నిన్ను నిన్ను నమ్ముతున్నాను "

"ఆత్మవిశ్వాసం ఉంటే దేన్నయినా సాధించవచ్చు."

"నీకా నమ్మకం ఉందా?"

"ఉంది నా అనుభవం అదే!"

"కర్మను గురించీ, పునర్జన్మ గురించీ మాట్లాడావు నువ్వు బుద్ధిష్టువా?"

"నేను అన్ని మతాల్ని గౌరవిస్తాను నమ్మకం మన మనసుల్లోనే ఉంటుంది. అది ఉంటే మనం దేని గురించీ భయపడనక్కర్లేదు"

"ఇటువంటి నమ్మకాన్ని నేను భారతదేశంలో పొందగలనా?"

"తప్పకుండా పొందగలవు"

అతను మాట్లాడిన ధోరణి ఆమెలో ధైర్యాన్ని రేకెత్తించింది.




"ఇక నువ్వు నీ క్యాబిన్‌కి వెళ్ళిపో. నా మాట నమ్ము నీ కష్టాలు త్వరలోనే తొలగిపోతాయి ధైర్యంగా ఉండు".

"ప్రయత్నిస్తాను" అన్నాడు చిన్నగా.

ఒక్క క్షణం ఆగి "నిన్ను మళ్ళీ ఎక్కడ, ఎప్పుడు కలుసుకోగలను, ఒకవేళ . " అన్నది.

"నువ్వు తప్పకుండా కలుసుకోగలవు"

అతను లేచి నిల్చున్నాడు. తన చేతిలో ఉన్న ఆమె చేతిని పెదవులకు హత్తుకొన్నాడు.

ఆమె ఆ మధురానుభూతి నుంచి బయటపడి ఏదో చెప్పాలనుకొన్నది కాని అతను అక్కడ లేడు.

ఆమెకు ఆశ్చర్యం కలిగింది అసలు నిజంగా అతన్ని చూసిందా? ఇంత వరకూ జరిగినదంతా నిజమా? లేక తన భ్రమా? అనుకొంటూ తన క్యాబిన్ వైపుకు నడిచింది.

ఆమె తన క్యాబిన్‌లో ప్రవేశించింది. ఆ క్యాబిన్ నుంచి ఆత్మహత్య చేసుకోవడానికి వెళ్ళి ఎన్నో సంవత్సరాలైనట్టుగా అన్పించింది. తన శరీరంలోని సత్తువనంతా ఎవరో లాగేసినట్టు నీరసంగా అన్పించింది ఆమెకు.

పక్కమీద వాలిపోయింది

తనకు ఇప్పుడు విశ్రాంతి కావాలి. రేపటి గురించి మర్చిపోవాలి. హాయిగా నిద్రపోవాలి

కాని తెల్లవారుతుంది తను తన బాబాయిని ఎదుర్కోవాల్సివుంది. ఈ రాత్రి తను ఇక పని చెయ్యలేదు

అయినా ఆమెకు మునుపటంత భయంగాలేదు. ఆమె ఆలోచనలన్నీ ఆ విత్తవ్యక్తి చుట్టూనే తిరిగిసాగాయి

చిత్రమైన వ్యక్తి '

ఎవరతను ?

అతను తనను శాసించడం. తను అనుమతించడం చిత్రంగా ఉంది. తను రావాలంటే అతని అనుమతి కావాలా ? అవును కావాలి. తను వాగ్దానం చేసింది అంత ఫూలిష్‌గా ఎందుకు ప్రవర్తించింది ?

అతని కళ్ళ ఆకర్షణకు లోబడిపోయిందా? అతని చూపుల్లో ఎదుటివాళ్ళను కట్టివేసే శక్తి ఏదో ఉంది

ఇంతకూ అతను భారతీయుడా లేక ఆంగ్లేయుడా?

ఆ విషయంలో తాను ఒక నిర్ణయానికి రాలేకపోతున్నది.

కాని అతని శరీరవర్ణం ఆంగ్లేయుల శరీరపు వర్ణానికి భిన్నంగా ఉంది. అయినా అతని భాష వింటే అతను ఆంగ్లేయుడేమో ననిపిస్తుంది

అతను ఇంకొంచెంసేపు మాట్లాడితే . అతను తెల్లవారేంత వరకూ తన దగ్గిరే కూర్చు మాట్లాడి ఉండకూడదా ?

క్రింది డెక్‌లోకి వెళ్తే అతను కన్పిస్తాడేమో !

కన్పించడు! కన్పించకపోతే తనకేం

ఎందుకు తను అతన్ని గురించి ఇంతగా ఆలోచిస్తున్నది ? అతనెవరు ? తనెవరు? అతను తనకు ఏమౌతాడు?

ఏమీ కాడా ?

మరి అతని కంఠం, ఒక మధురగీతం తాలూకు ఆలాపనలా తన మనసును ఎందుకు ఇంకా చుట్టుకొనే ఉన్నది?

ఆతను తనకు జీవితంపట్ల ఆసక్తిని కలిగించాడు తనలో ఏదో మార్పు వచ్చింది! అతన్ని మర్చిపోలేకుండా వున్నది ఇదో వింత అనుభవం. తను ఎందరోన్నో చూసింది కాని ఇతని పరిచయం పేరు కూడా తెలియదు

కొద్ది నిమిషాల పరిచయం మాత్రమే. కాని ఆ పరిచయం తనకు యుగయుగాల పరిచయంలా, జన్మజన్మల పరిచయంలా అనిపిస్తోంది.

దీన్నే కర్మ అంటారా ?

ఈ ప్రపంచం ఒక అతీతశక్తి ద్వారా నడిపించబడుతోందని అను క్రిస్టియన్. తనకు భగవంతునిమీద నమ్మకం వుంది.

సృష్టిలో మానవజన్మ సర్వశ్రేష్టమైనది. అయినా అతడు కర్మచేత నడిపించబడుతున్నాడా ?

అవును "బుద్ధిః కర్మానుసారిణీ" అని భారతీయులు భావిస్తారట. అది నిజమేనేమో !

లేకపోతే తను అతనిని గురించి ఇంతగా ఎందుకు ఆలోచిస్తున్నది.

సీత కనురెప్పలు బరువుగా వాలిపోయాయి.

"నువ్వు ధైర్యంగా ఉండాలి. నీపేరు సీత. భారతీయుల ఆరాధ్యదేవత. ఆమె ఎన్నో కష్టాలను ధైర్యంగా ఎదుర్కొన్నది. ఆమె పరమ పవిత్రురాలు. నువ్వు నీ పేరును సార్థకం చేసుకోవాలి" అతని కంఠం మళ్ళీ ఆమె చెవుల్లో

మార్కు మోగుతున్నది

ఆ కంఠాన్ని మధురగానంలా వింటూ సీత నిద్రలోకి జారిపోయింది.

## 2

సీత తృళ్ళిపడి నిద్రలేచింది.

అప్పటికే బారెడు పొద్దెక్కింది

గాభరాగా మంచం దిగింది

బాబాయి లేచి ఉంటాడు టిఫిన్ చేసి సెలూన్‌లో తన కోసం కోపంగా ఎదురుచూస్తూ ఉంటాడు.

అయినా చిత్రం తనకు ఇంతకుముందులా భయం కలగడం లేదు

సీతకు ఈ ఉదయమే కొత్తగా ఉంది సూర్యకిరణాల స్పర్శలో ఇంతకు ముందులేని అద్భుతమైన ఆనందానుభూతి ఏదో ఉన్నట్టు అన్పించింది ఆమెకు. ఆ గాలి, ఆ వాతావరణం ఆమెకు ఏదో కొత్త సందేశాన్ని ఇస్తున్నట్టుగా అన్పించ సాగింది.

ఆ పల్చటి గౌను ధరించింది క్రితం రోజులాగే వాతావరణం వేడిగా ఉంది బాలభానుని కిరణాలకాంతి సముద్ర కెరటాలను సున్నితంగా తాకుతున్న ట్టుగా ఉంది ఓడ చిన్నగా సముద్రాన్ని చీలుస్తున్నట్టు ముందుకు సాగిపోతున్నది.

ఇంతకుముందు ఆమె ఆలస్యంగా నిద్రలేచిన రోజు భయపడుతూ హార్వే ముందు అపరాధిలా తలవంచుకొని నిల్చునేది

ఈరోజు ఆమె తిన్నగా హార్వే క్యాబిన్‌కు వెళ్ళలేదు. తాపీగా ఓడ పై డెక్ మీదకు వెళ్ళింది

దూరంగా కన్పిస్తున్న క్షితిజాన్ని చూస్తూ నిల్చుంది

ఇంతకాలంగా తనను బాధిస్తున్న ఒంటరితనం అకస్మాత్తుగా పోయినట్టుగా అన్పిస్తోంది ఆమెకు

తను ఒంటరిది కాదనీ, ఏదో కొత్త ప్రపంచంలోకి అడుగుపెడుతున్నట్టూ అన్పిస్తోంది. ఆ కొత్త ప్రపంచం ఆకర్షణీయంగా, అతి దగ్గరగా ఉన్నట్టు తోస్తు న్నది

హార్వే అంత కఠినంగా ప్రవర్తించడానికి కారణం అతను తన జీవి తంలో ఎక్కువ భాగం భారతదేశంలో ఉండటం వల్లనేనని ఆమె అభిప్రాయం అందుకే ఆమెకు భారతదేశం అంటే అయిష్టం ఏర్పడింది.




ఆమెకు తండ్రి గుర్తొచ్చాడు. తండ్రి దగ్గిర ప్రాంతీయ చిత్రాలు అనేకం ఉండేవి రాజస్తాన్ పెయింటింగ్స్ కాపీలు ఆయన దగ్గిర ఉండేవి ఏనుగులూ, అందమైన దుస్తుల్లో ఉన్న మహారాజులూ, రా...లూ ఆ పెయింటింగ్స్‌లో ఉండేవి.

అవి ఇప్పుడు ఎక్కడున్నాయో? బాబాయి స్టోర్ రూంలో దుమ్ముకొట్టుకొని సామానులమధ్య పడిఉంటాయి తన తల్లిదండ్రులు పోగానే, తనతోపాటు, తమ ఇంట్లో ఉన్న వస్తువులన్నీ బాబాయి ఇంటికి— వింబుల్డన్‌కు వచ్చి చేరాయి.

తను పుట్టెడు దుఃఖంలో ఉండడం వల వాటి గురించిన ఆలోచనే తనకు రాలేదు తన దుస్తులతో పాటు, తన తల్లిదుస్తులు కూడా తనకు ఇచ్చాడు బాబాయి

హార్వే డబ్బు ఇచ్చేవాడు కాదు అందువల్ల ఆమె తన దుస్తులు చిరిగి పోయాక తల్లిదుస్తులు ధరిస్తున్నది అవి ఆమెకు పెద్దవిగా ఉన్నా వాటినే ధరి స్తున్నది.

హార్వే అప్పుడప్పుడు చౌకబారుదుస్తులు సీతకు కొని ఇచ్చేవాడు. ఆమెకు మంచి బట్టలు వేసుకోవాలని ఉంటుంది

సీతకు తల్లి మాటలు గుర్తొచ్చాయి

"భారతదేశం దర్జీలు ఇళ్ళ వరండాల్లో కూర్చుని దుస్తులు కుడుతుంటారు

ఎలాంటి దుస్తుల్ని చూపించినా, వెంటనే వాటిని చూసి అలాంటివే కుట్టే నైపు
ణ్యం వాళ్ళకు ఉంటుంది" అని ఆమె తల్లి చెబుతూ ఉండేది.

ఆమెకు ఇండియా చేరగానే కొత్తరకం దుస్తులు కుట్టించుకోవాలనిపించింది

ఎలా? బాబాయి డబ్బు ఇవ్వడు తన తల్లి దుస్తుల్లో తను ఇమిడిపోక
పిచ్చుకపిల్లలా, చుట్టూ ఉండే ఆడవాళ్ళ మధ్యన ఎబ్బెట్టుగా కన్పించినా బాబాయి
లక్ష్యపెట్టడు తనకోసం చస్తే డబ్బు ఖర్చుపెట్టడు

భారతదేశం మీద అంతకుముందున్న ఉదాసీనభావం పోయింది, ఎప్పుడు
ఆ దేశం చూద్దామా అనే ఉత్సుకత ఆమెలో రేకెత్తింది

ఆమె తన బాబాయితో బయలుదేరినప్పుడు కేవలం, హార్వే ప్రసాదించ
బోయే తిట్ల గురించీ దెబ్బల గురించీ మాత్రమే ఆలోచించింది

సీత ఎన్నోసార్లు తనుకూడా అమ్మానాన్నలతో పాటు మునిగిపోయి ఉంటే
ఎంత బాగుండేదని ఆలోచన వచ్చింది.

ఆనాడు వాళ్లు సముద్రతీరంలో మునిగిపోయిన రోజు తను వాళ్ళతో
వెళ్ళకపోవడం కర్మ ప్రభావం వల్లనేనేమో!

వారం రోజులు తను డెవాన్ షైర్ లో తల్లిదండ్రులతో పాటే నావలో
చేపలు పట్టడానికి వెళ్ళింది. తన తండ్రికి అది ఒక హాబీ

ఆరోజు ఆకాశం మేఘావృతమై ఉన్నది "వర్షం వచ్చేలా ఉంది నువ్వు
వద్దు బయలుదేస్తే జ్వరం వస్తుంది" అన్నది తల్లి.

తండ్రికూడా ఆమెను సమర్థించాడు

తను వాళ్ళతో వెళ్ళాలని పట్టుపట్టలేదు

కారణం తన స్నేహితురాలితో ఆరోజు వేరే ప్రోగ్రాం వేసుకొనడమే.
తనకూ, తన స్నేహితురాలికీ బొమ్మలు గీయడం హాబీ ఇద్దరూ సముద్రతీరానికి
వెళ్ళి ఒడ్డున ఉన్న పడవల్నీ, అక్కడ ఉన్న పక్షిజాలుల్ని చూస్తూ స్కెచ్ గీస్తూ
కూర్చున్నారు.

సముద్రంలో పెద్దపెద్ద రటాలు లేస్తున్నాయి సముద్రంలో ఏదో అల
జడి బయలుదేరినట్టుగా ఉంది వర్షం ప్రారంభమయింది ఇద్దరూ అక్కడ్నుంచి
వచ్చేశారు.

తను తన కాటేజీలో ఒంటరిగా కూర్చుంది అమ్మనాన్నల కోసం ఎదురు




చూస్తూ ప్రొద్దుపోయినా వాళ్లు రాలేదు అర్ధరాత్రి అయింది తను బిక్కు-బిక్కు-మంటూ కూర్చుంది

అప్పుడే కాటేజీ ముందు జనం హడావిడిగా మూగినట్టు తోచింది బయటికి వచ్చింది తను దారుణ దృశ్యం తను ఏనాటికీ మరువలేని దృశ్యం. తడిసిన శవాలు- తన తండ్రీ తల్లీ ఇద్దరూ శాశ్వతంగా తనను వదిలి వెళ్ళిపోయారు తను వాళ్ళమీద పడి ఏడుస్తుంటే ఎవరో దూరంగా ఏ గారు

తన బాబాయి వచ్చేంతవరకు తను తన తండ్రి స్నేహితుడి ఇంటోనే ఉన్నది బాబాయి వచ్చాడు తనతో తీసుకెళ్ళాడు అంతే- తన జీవితానికి నరకపు తెరలు ఎత్తినట్టు అయింది

గతంలోనుంచి వర్తమానంలోకి వచ్చింది సీత

సముద్రంకేసి చూసింది. ప్రశాంతంగా ఉన్నది సముద్రం తన మనసు కూడా ప్రశాంతంగా ఉన్నది ఇక తన జీవితం ఆటూ—పోటూలకు గురికాదు. బంగారు భవిష్యత్తు తనకోసం ఎదురు చూస్తున్నట్టుగా అనిపిస్తున్నది ఎన్నడూ లేని ఏదో సంతృప్తి మనసును చుట్టివేసింది.

అంతలోనే ఏదో సందేహం వచ్చింది తను తాడూ బొంగరం లేకుండానే ఆటలో గెలుపొందినట్టు భావిస్తోందా?

"లేదు నువ్వు ఊహిస్తున్నది తప్పక జరుగుతుందనే నమ్మకాన్ని నీలో పెంచుకో."

ఎవరో— ఎవరోకాదు . అతనే అవును అతని కంఠమే - తనకు విన్పించింది

గిరున వెనక్కు తిరిగి చూసింది

అక్కడ ఎవరూలేరు

అవును అతను రాలేదు. కాని అతని కంఠం తనకు విన్పించింది. లేక అలా అన్పించిందో! అతను తన ఆలోచనలు తనకు పంపిస్తున్నాడు

నెత్తి చుర్రుమనడంతో సీత తృళ్ళిపడింది

చాలా ఎండెక్కింది బాబాయి గంతులేస్తూ ఉండి ఉంటాడు

సీత తాపీగా, నిర్భయంగా, డైనింగ్ హాలుకు నడిచింది

# 3

సీత డైనింగ్ హాల్లో ప్రవేశించింది

అక్కడ హార్వే లేడు

బ్రేక్‌ఫాస్టు పూర్తిచేసి తన క్యాబిన్‌కు వెళ్ళిపోయాడు

అతని రౌద్రరూపం కళ్ళకు కట్టినట్టుగా ఉంది

అయినా ఆమె నిబ్బరంగానే ఉంది.

బ్రేక్‌ఫాస్టు చేసింది ఈ ప్రయాణంలో ఈ రోజు మాత్రమే ఆమెకు బ్రేక్‌ఫాస్టులో పెట్టిన పదార్థాలు ఎంతో రుచిగా ఉన్నట్టు తోచింది

ఫలహారం ముగించి, తన క్యాబిన్‌లోకి వెళ్ళింది మాన్యుస్క్రిప్టు తీసుకుంది రాత్రి ఫెయిర్ చెయ్యలేదు. అయినా భయంగా లేదు. ఆమెకు తన ధైర్యంమీద తనకి ఆశ్చర్యంగా తోచింది

"ఇంత ఆలస్యం అయిందేం?" గుర్రుమన్నాడు హార్వే

ఆమె మాట్లాడలేదు.

"నాకు తెలియక అడుగుతాను- ఈ వయసులో ఇంత బద్ధకం ఏమిటి? ఎందుకింత ఆలస్యం అయింది?"

"త్వరగా మెలుకువ రాలేదు."

"అదే - ఎందుకంటున్నాను?"

ఆమె తలవంచుకున్నది

"నిద్ర! నిద్ర! ఎప్పుడూ నిద్రేనా? నేను ఈ వయసులో ఎంత పని చేస్తున్నానో చూస్తున్నావుగా? సోమరిపోతులంటే నాకు అసహ్యం "

ఆమె తల ఎత్తలేదు

"రాత్రి కాగితాలు టెయిర్ చేశావా? ఏవీ?"

"చెయ్యలేదు"

హార్వే ఆశ్చర్యంగా ఆమెకేసి చూశాడు తను చూస్తున్నది సీతనేనా?

హార్వే చివ్వున లేచి నిల్చున్నాడు

"రాయలేదా? ఎందుకు రాయలేదు?" దగ్గరకు వచ్చాడు హార్వే

సీత వెనక్కు తగ్గింది తలెత్తి అతన్ని చూసింది. మళ్ళీ మామూలుగానే భయం శరీరంలోకి చగికుదుపులా ప్రవేశించింది గజగజ వణికిపోతూ, బేల చూపులు చూస్తూ నిల్చుంది

"మాట్లాడవేం?"

"సారీ అంకుల్! ఈ రాత్రికి పూర్తిచేస్తాను" వణుకుతూ సమాధానం ఇచ్చింది.

"ఇవాల్టి పని రేపు చేస్తావా? పైగా నిన్నటి స్క్రిప్టునిండా తప్పులే ఏమైంది నీకు నీకంటే ప్రైమరీ స్కూల్లో చదివే పిల్లలు బాగా ఫెయిర్ చెయ్య గలరు" అని టేబుల్ మీద ఉన్న కాగితాలను అందుకున్నాడు

సీత దగ్గరికి నడిచాడు

"చూడు ఎన్ని తప్పులో!" కాగితాలను సీత ముఖంమీద విసిరికొట్టాడు

"నీకు తిండి పెడ్తున్నాను గతిలేని నీకు ఆశ్రయం ఇచ్చాను. నీ బరువు బాధ్యతల్ని వహిస్తున్నాను తేరతిండి తింటుంటే బొత్తిగా వళ్ళు వంగడం లేదు" అరిచాడు హార్వే

సీత కళ్ళల్లో నీరు తిరిగింది

"యూ ఫూల్! స్టుపిడ్! మాటకుముందు ఏడుపొకటి వెళ్ళు ఇవన్నీ మళ్ళీ రాసి పట్టుకురా ఆ తర్వాత రాత్రి చెయ్యవలసిన పని చెయ్యి, లేదా నీ ఎముకలు విరక్కొడతాను జాగ్రత్త పో! ఆ కాగితాలు తీసుకెళ్ళు!"

(వచ్చే నెల మళ్ళీ)



యర్రంశెట్టిశాయి హ్యూమరాలజీ

4

# సెన్సార్ కత్తెర జిందాబాద్

సెన్సార్ ఆఫీస్‌కి వరుసగా నాలుగు టాక్సీలు వచ్చి ఆగాయ్

మొదట టాక్సీలో నుంచి విప్లవ్ దిగాడు. అతని వెనుకే అతని యూనిట్ సభ్యులు. మరుక్షణంలో ఆ ప్రాంత మంతా వారి కేకలతో దద్దరిల్లిపో సాగాయ్.

సెన్సార్ బోర్డ్ - డౌన్ డౌన్

ముర్దాబాద్ ముర్దాబాద్ - సెన్సార్ బోర్డ్ ముర్దాబాద్.

సెన్సార్ పాలసీ - ఛీ ఛీ!

సెన్సార్ బోర్డ్ సభ్యులు - ఛోఛో!

సెన్సార్ కత్తెర - ఛీ! ఛీ!

సెన్సార్ నిబంధనలు - హెల్! హెల్!

"మేము నిర్మించిన 'మారణ హోమం' సినిమాకు - వెంటనే క్లీన్ సర్టిఫికెట్ ఇవ్వాలి. అర్థంలేని అంట కత్తెరలు - నశించిపోవాలి!

ఈ హడావిడికి అప్పటికే అక్కడ గారడీవాడికి పోగయినట్టు జనం పోగ య్యారు.

విప్లవ్ కేకలు కాసేపు వాయిదావేసి తన వెంటవచ్చిన వాళ్ళిద్దరిని పిలిచి ఏదో చెప్పాడు.

వాళ్ళిద్దరూ ఏరో స్పీకరూ సంచీల్లో నుంచి తీసి పాట మొదలెట్టారు.

సూర్యకాంతి నాపడం - నీయబ్బ తరమా?

మా సినిమాను బాన్ చేయడం - నీ యబ్బ తరమా?

విప్లవాన్ని ఆపడం- నీ తాత తరమా?

మా సినిమాను కత్తిరించడం - నీ తాత తరమా?

అక్కడ చేరిన వారందరూ ఆ పాటను ఆనందిస్తున్నట్లే కనబడింది వాతావరణం.

ఈ హడావిడికి సెన్సార్ బోర్డ్ ఆఫీసరు ఖంగారుగా బయటి కొచ్చాడు.

"ఏమిటి? ఏం జరిగింది?" అనడి గాడు ఎదురుగ్గా నిలబడ్డ విప్లవ్‌ని.

"ఏం జరగటమా? హు? ఏం జరి గిందీ అనడుగుతున్నారా? హు హు! నేను నిర్మించి, దర్శకత్వం వహించిన ప్రప్రథమ చిత్రాన్ని త్రొక్కిపడతారా? అరవై కట్లు సజెస్ట్ చేస్తారా? బాన్ చేస్తారా? హుహుహు! చూస్తాను-ఇవాళ నా సినిమాని ఆపగలరు! కానీ రేపు విప్లవాన్ని ఆపగలరా? లేరు, లేరు, లేరు!" ఆవేశంగా అరిచాడు విప్లవ్.

"అయ్యా! మీరనేదేమీ నాకు తెలీ టంలేదు" అన్నాడు ఆఫీసరు అయో మయంగా.

"అదే! మీరు నిర్దాక్షిణ్యంగా, నిరంకుశత్వంగా సర్టిఫికెట్ ఇవ్వకుండా ఆణచిపెట్టిన నా సినిమా సంగతేమిటి, అని మిమ్మల్ని అడుగుతున్నాను-ప్రశ్ని స్తున్నాను-"

"చూడునాయనా! సర్టిఫికెట్ ఇవ్వని సినిమాలు రెండొందల లపాటికఉన్నాయ్! అందులో మీదేదీ?"

"ఆ! ఏమిటి? మా సినిమాయే తెలీదా? కాదు! తెలుసు! కానీ తెలీనట్లు నాటకం! ఎందుకంటే మీలో ఉన్నది బూర్జువా రక్తం!"

నా రక్తం ఎబి గ్రూప్ అని డాక్టర్లు చెప్పారుబాబూ! బూర్జువాగ్రూపుకాదు"

"అయితే అరవై కట్స్ విధించిన మాసినిమా సంగతేమిటి? అన్ని కట్స్ ఎందుకు విధించారు? ఎందుకు బాన్ చేశారు?"

"అయ్యా! అరవై కట్స్ విధించిన సినిమాలు మా లిస్టులో నూటపాతిక ఉన్నాయ్. బాన్ చేసినవి డెబ్బయ్యారు న్నాయ్. అందులో మీదేదో చెప్పకపోతే ఎలా తెలుస్తుంది?"

"మాది విప్లవాత్మకమైన చిత్రం! పేరు "మారణహోమం"!"

"చూడు నాయనా! ప్రభుత్వం ఇచ్చిన మార్గదర్శక సూత్రాల ప్రకారమే ఎగ్జామినింగ్ కమిటీ ఆ కట్స్ విధించింది. మీరు ఆ కట్స్ చేయడానికి నిరాకరించడం వల్ల అది రివైజింగ్ కమిటీ కెళ్ళింది. వాళ్ళు మీ సినిమాను బాన్ చేయాలని తీర్మానించారు దీనికి మేమేం చెయ్యం?" అనేసి ఆఫీసరు లోపలికెళ్ళిపోయాడు

"అదే కుట్ర! అదే మోసం! అదే దగా! నా సినిమాను బాన్‌చేసి నా పరువూ, ప్రతిష్ఠా, నా భవిష్యత్తూ, నా సినిమా కలెక్షన్లూ అన్నీ మంట కలపాలని, నా విప్లవ భావాల్ని నాలోనే అంతం చేయాలని మీరాడుతున్న నాటకం ఇది; కానీ నేను మీ కుట్రకు బలయ్యే పక్షిని కాదు. మీ సెన్సార్ విధానాల్ని, మీ కేంద్ర ప్రభుత్వం ఇచ్చిన గైడ్ లైన్‌నీ, మీ తెలివి తేటల్నీ మీ కత్తెరనూ - నా కంఠంలో ఆఖరి ప్రాణం బొట్టు ఉన్నంతవరకూ ఎదిరిస్తాను పోరాడతాను"

అనేసి వెనక్కు తిరిగి "సెన్సార్ బోర్డ్" అని అరిచాడతను,

అందరూ 'డౌన్ డౌన్' అంటూ ముక్తకంఠంతో అరిచారు ఈసారి అక్కడ ఈ గొడవ చూడ్డానికని గుమిగూడిన బఠాణీలవాళ్ళూ, అయిస్ క్రీమ్ కుర్రాళ్ళూ, సిటీ చూడ్డానికొచ్చిన పల్లెటూరి వాళ్ళూ- ఇంకా అనేకరకాల జనం కూడా ఉత్సాహంగా అరవడం ప్రారంభించారు.

సెన్సార్ బోర్డ్ - డౌన్ డౌన్

ముర్దాబాద్ ముర్దాబాద్ - సెన్సార్ బోర్డ్ ముర్దాబాద్

సెన్సార్ పాలసీ - ఛీ ఛీ!

సెన్సార్ బోర్డ్ మెంబర్స్ - థోథో!

సెన్సార్ కత్తెర - ఛీ, ఛీ!

సెన్సార్ రూల్స్ - హెల్ హెల్!

మారణహోమం - రిలీజ్ చెయ్.

అర్బైకట్లూ గో బాక్!

వుయ్ డిమాండ్ -క్లీన్ సర్టిఫికెట్.

మా చిత్రం మీద నిషేధం - తీసేయాలి ఈ క్షణం-

అరుపులు కేకలు ఈలలూ క్రమ క్రమంగా పెరిగిపోతూండేసరికి ఆఫీసరు హడావుడిగా బయటికొచ్చాడు.

"అయ్యా-మీరిలా అల్లరి చేస్తుంటే ఆవతల మా ఆఫీస్ పని ఎలా జరుగుతుందిచెప్పండి! మీరు చెప్పదల్చుకున్నదేదో నినాదాల రూపంలో కాకుండా మెమొరాండం రూపంలో ఇస్తే పై అధికారులకు పంపుతాను." అన్నాడు వినయంగా

"అదేం కుదరదు! ఇవాళ సాయింత్రం వరకూ అరుస్తూనే ఉంటాం! రేపట్నుంచీ నేనూ, మా యూనిట్ సభ్యులు- అందరం ఇక్కడే నిరాహార దీక్ష ప్రారంభిస్తున్నాం! ఆ తరువాత పర్యవసానం చాలా తీవ్రంగా




ఉంటుంది" అని అన్నాడు.

చేసేదిలేక ఆఫీసరు మళ్ళీ లోపలి వెళ్ళిపోయాడు.

మర్నాడు అందరూ నిరాహారదీక్ష ప్రారంభించారు.

అన్ని న్యూస్ పేపర్లలోనూ ఈ వార్త మార్మోగిపోయింది

రెండో రోజునే విప్లవ్‌కి సెన్సార్ ఆఫీసర్ నుంచి కబురు వచ్చింది.

"మీ సినిమా కేవలం రెండు కట్స్‌తో రిలీజ్ చేయడానికి ప్రభుత్వం అనుమతించింది" అన్నాడు ఆఫీసరు

వెంటనే బయటకు పరుగెత్తి 'ఇంకిలాబ్' అని అరచాడు విప్లవ్

అందరూ 'జిందాబాద్' అని అరిచారు.

విప్లవం-గెలిచిందీ
కుట్ర-ఓడిందీ
సెన్సార్ బోర్డ్- డౌన్ డౌన్
మారణహోమం- జిందాబాద్-

అందరూ కేకలు వేసుకుంటూ వెళ్ళిపోయారు. ఆ సినిమా రిలీజయి చెండొందల రోజులాడి- ఇంకా ఆడుతూ సాగింది. వెంటనే రెండో సినిమా తీస్తున్నాడు విప్లవ్.

ఓ మంచి రోజు చూసుకుని సెన్సార్ ఆఫీస్‌కి టాక్సీలో చేరుకున్నాడు.

"హాలో హాలో హాలో- విప్లవ్‌గారా! రండి! కూర్చోండి" అన్నాడు సెన్సార్ ఆఫీసర్

"మా 'అగ్నికణం' సినిమా ఎగ్జామినింగ్ కమిటీ వాళ్ళు చూశారా?" అడిగాడతను

"చూశారండి నేనే మీకా విషయం ఫోన్ చేద్దామనుకుంటున్నాను. ఇంతలో మీరే వచ్చేశారు-"

"ఇది కూడా 'బాన్' చేస్తున్నారు కదూ?"

"నోనోనో- లేదండి! నో బాన్!" చిరునవ్వుతో అన్నాడు ఆఫీసర్.

విప్లవ్ అదిరిపడ్డాడు.

"ఏమన్నారు? బాన్ చేయడం లేదా?"

"లేదండీ! బాన్ చేయాలన్న అయిడియా అసలెవ్వరికీ రాలేదు-" విప్లవ్ మొఖం పాలిపోయింది.

"ఇది అన్యాయం! అక్రమం!" అంటూ టేబుల్ మీద గట్టిగా చరచాడు.

ఆఫీసర్ అదిరిపోయి లేచి కుర్చీ వెనక్కి వెళ్ళి నిలబడ్డాడు.

విప్లవ్ కళ్ళముందు తన సినిమాను కొనడానికొచ్చిన జిల్లాలవారీ కొనుగోలు దార్లు కనబడుతున్నారు. తన సినిమా చూడ్డానికి వచ్చిన జనం కనబడుతున్నారు

"ఈ సినిమాకు సెన్సార్లోళ్లు క్లీన్ సర్టిఫికెట్ ఇచ్చార్రా! అంటే చెత్త పిక్చరయి ఉంటుంది-" అనుకుని జనం వెనక్కి వెళ్ళిపోతున్నారు.

"అయ్యా మా జిల్లాకు రెండొందల అరవై రూపాయలకయితే కొంటాను" అంటున్నాడో కొనుగోలుదారు.

"ఏమిటీ రెండొందల అరవయ్యా! నీకేం మతిపోలేదు కదా!"

"అంతే గురూజీ! ఈ విప్లవాలు, గొడవలూ చాలా సినిమాల్లో ఉన్నాయ్. మనక్కావలసింది అది కాదు. అదీ వరకులాగా 'బాన్' చేయడం- మీరు నానా గొడవ చేయడం జరుగుతే మంచి పబ్లిసిటీఅయి జనం చూడ్డానికొస్తారు-" అనేసి వెళ్ళిపోయాడతను.

విప్లవ్ స్పృహలో కొచ్చాడు.

"ఇది అన్యాయం అంటున్నాను-" మళ్ళీ బల్ల గుద్దాడతను.

"ఏది అన్యాయం?" అయోమయంగా అడిగాడు సెన్సార్ ఆఫీసర్.

"సినిమా 'అగ్నికణం' బాన్ చేయాలని సజెస్ట్ చేయకపోవడం-"

అప్పటికి గానీ సెన్సార్ ఆఫీసర్ కి విషయం అర్థం కాలేదు కానీ ఆశ్చర్యం నుంచి మాత్రం ఇంకా తేరుకోలేదు.

"కానీ మీ పిక్చర్ లో అభ్యంతరకరమయిన దృశ్యాలు ఏమీ లేందే- 'బాన్' ఎందుకు సజెస్ట్ చేస్తారు?"

"అభ్యంతరకరమయిన దృశ్యాలు ఏమీ లేవా?" ఇంకా కోపంతో రెచ్చిపోతూ అన్నాడు విప్లవ్.

"లేవు అనే అంటున్నారు-"

"వాళ్ళకు మతిపోయి అంటున్నారు. లేకపోవడ మేమిటి? సినిమా మొదట్నుంచీ చివరి వరకూ ఉన్న సీన్లల్లో ముప్పై సీన్లు పరమ అభ్యంతరకరమైనవి. పోలీసులు- ఓ పిల్లల తల్లి రిపోర్టివ్వడానికొస్తే ఆమెను రేప్ చేయడం- ఆమె వాళ్ళమీద రిపోర్టివ్వడానికి




కలెక్టరు దగ్గరకెళ్తే అతనూ రేప్ చేయడం- చివరకు మంత్రి కూడా ఆమెను రేప్ చేయడం- అప్పుడు ఆమె ఆత్మహత్య చేసుకోవడం- అది చూసి ఆమె మ్ముడు కత్తి తీసుకుని వారందరినీ చంపడం- అక్కడితో ఆగక విప్లవ నాయకుడయి ప్రజల్ని సమీకరించి డబ్బున్న వాళ్ళనూ, ఆఫీసర్లనూ, ఆధికారంలో ఉన్న రాజకీయ నాయకులనూ అందరినీ నరుక్కుంటూ వెళ్ళి- ప్రభుత్వాన్ని పడగొట్టి, అడ్డువచ్చి మన మిలటరీని చిత్తుగా ఓడించి- కొత్త ప్రభుత్వం ఏర్పాటు చేయడం- ఇవన్నీ ఏమిటి? అభ్యంతరకరమైనవి కాదా? ఆ సీన్లలో మేము పెట్టిన ప్రతి డైలాగూ అభ్యంతరకరమే! మాకు తెలుసా విషయం! కాదని మీరెలా అనగలరు?"

సెన్సార్ ఆఫీసరుకి చిరాకు పుట్టుకొచ్చింది.

"చూడండి! మా ఎగ్జామినింగ్ కమిటీ చెప్పాల్సిన విషయాలవి! వాళ్లు ఎలా చెప్తే అలా చేస్తాం గానీ- మీరు చెప్పినట్లులా చేస్తాం?"

విప్లవ్ కొద్ది క్షణాలకు ఆవేశం అణచుకుని కుర్చీలో కూలబడిపోయాడు మళ్ళీ జేబులోనుంచి కర్చీఫ్ తీసి చెమటలు తుడుచుకున్నాడు

"సరే - జరిగిందేదో జరిగింది! కట్స్ ఏమైనా సజెస్ట్ చేశారు? అవయినా పదిహేనో, ఇరవయ్యో ఉన్నాయా?" అడిగాడతను.

"క్లీన్ సర్టిఫికెట్ ఇస్తున్నామండీ! కట్స్ కూడా ఎవ్వరూ సజెస్ట్ చేయలేదు. సినిమా నీట్‌గా, చక్కగా ఉందంటున్నారు అందరూ! ఇంకా కట్సెందుకు" చిరాగ్గా అన్నాడు సెన్సార్ ఆఫీసర్.

దాంతో విప్లవ్ ఉగ్రుడైపోయాడు.

"ఇది అన్యాయం అని ఇంతక

న్నాను గుర్తుందా?" సెన్సార్ ఆఫీసర్ని అడిగాడతను.

"అవును! గుర్తుంది! ఎందుకు?"

"ఇప్పుడా మాట ఉపసంహరించుకుంటున్నాను. ఇది అన్యాయం కాదు. కుట్ర! నా పరువు ప్రతిష్టలు, నా భవిష్యత్తూ, నా సినిమా కలెక్షన్లూ అన్నీ మంట కలపాలని మీరాడుతున్న నాటకం! దగా! మోసం!-" బిగ్గరగా అరచాడతను.

అతని అరుపులకు ఆఫీస్‌లోని స్టాఫ్ అంతా పరుగుతో వచ్చారక్కడికి.

విప్లవ్ వాళ్ళందరినీ చూసి మళ్ళీ స్పృహలో కొచ్చాడు.

"నేను గట్టిగా మాట్లాడానా?" వాళ్ళనడిగాడు అయోమయంగా

"మాట్లాడడమేమిటి సార్! అరచారు"

"అయామ్ సారీ!" వాళ్లు వెళ్ళిపోయారు మళ్ళీ.

"ఇదిగో విప్లవ్‌గారూ! ఇందాకటి నుంచీ చూస్తున్నాను. మీ డైలాగులు నాకేమాత్రం అర్థం కావటంలేదు. మీ సినిమాకి క్లీన్ సర్టిఫికెట్ దొరుకుతుంటే సంతోషించక - బాన్ ఎందుకు చేయలేదు? కట్స్ ఎందుకు లేవు? ఇదంతా కుట్ర అంటారేమిటి-" విసుగ్గా అడిగాడు సెన్సార్ ఆఫీసర్.

విప్లవ్ శాంతించాడు. తను ఆవేశపడితే ఏమాత్రం లాభం లేదని అర్థమైపోయింది.

"అయ్యా! నేను ఇంతకుముందు తీసిన సినిమాకు మీరు ఓ పట్టాన సర్టిఫికెట్ ఇవ్వకపోవడం మూలాన ఆ సినిమాకు అది పబ్లిసిటీ అయింది. నా సినిమా రిలీజ్‌కి అనుమతి ఇవ్వాలంటూ నేను నానాగొడవ చేసి పేపర్లనిండా స్టేట్‌మెంట్లిచ్చి, ఆఖరికి మీరు కొన్ని కట్స్‌తో పర్మిషనిచ్చాక "సెన్సార్ వారితో పద్దెనిమిది నెలలు హోరాహోరీ పోరాటం తర్వాత రిలీజవుతున్న మహోజ్వల చిత్రం" అని వాల్‌పోస్టర్ల మీద, గోడల మీద రాయించి రిలీజ్ చేసేసరికి మేము నాలుగు వారాలాడుతుందనుకున్న సినిమా ముప్పయ్ వారాలాడింది. మా పార్ట్‌నర్స్‌కూ, డిస్ట్రిబ్యూటర్స్‌కీ, బైయర్స్‌కీ - అందరికీ తెగ లాభాలొచ్చాయ్. ఈ సినిమాకూడా అదే పబ్లిసిటీ ఇవ్వవచ్చని ఆశపడ్డాం. అంతేకాదు. ముందే వాల్‌పోస్టర్లూ, ఇతర పబ్లిసిటీ మెటీరియల్ అంతటా - "సెన్సార్‌వారి కబంధ హస్తాలనుండి- తీవ్రపోరాటం ద్వారా రిలీజవుతున్న 'వీరవిప్లవ అగ్నికణం' అని ప్రింట్ చేయించేశాం! ఇప్పుడు మీరు మాతో వివాదం పెట్టుకోకపోతే మా సినిమా ఏమయిపోతుంది? మేమేమయిపోతాం? అంచేత దయచేసి కనీసం కొన్ని కట్స్ అయినా సజెస్ట్ చేయండి- నేను వాటిని తిరస్కరిస్తాను. అప్పుడు అది రివై






# క్లినిక్ స్పెషల్

కాని మీరు
వదిలించుకోవల్సింది ఓ పటాన
లొంగని, తీవ్రమైన చుండు
అయితే మీకు కావల్సిన
షాంపూ, క్లినిక్ ని మించినదై
ఉండాలి మరి




క్లినిక్ మీ చుండుపై పనిచేసిందని, మీకు సరిగా సరిపడిందని మాకు తెలుసు. అయితే ఓ పటాన లొంగని తీవ్రమైన చుండుగల వారున్నారన్న సంగతీ మాకు తెలుసు.

అందుకే ఓ పటాన లొంగని, తీవ్రమైన చుండును తొలగించేందుకు కొత్త సూత్రీకరణను ప్రవేశపెట్టాం. క్లినిక్ మించినదది...దాని పేరు క్లినిక్ స్పెషల్. ఆ! ఇప్పుడు రెండు క్లినిక్ షాంపూలు ఉన్నాయి. మామూలు చుండుకు క్లినిక్... ఓ పటాన లొంగని తీవ్రమైన చుండుకు క్లినిక్ స్పెషల్. ఇక ఈ రెండింటి కలయిక చుండు సమస్యలన్నింటికీ నివారణ మరి

హిందుస్తాన్ లీవర్ లిమిటెడ్ వారి
విశిష్ట ఉత్పాదన

జింగ్ కమిటీ కెళ్తుంది. వాళ్ళు ఆ కట్స్‌ని సజెస్ట్ చేస్తారు. నేను ఒప్పుకోకుండా మొండికేస్తాను. అప్పుడది సెన్సార్ బోర్డ్ చైర్మన్ కెళ్తుంది. నేను వాళ్ళమాటా వినను - అలా నేనూ మీరూ పేచీలు పడుతూ - కిందా మీదా పడుతూ- స్టేట్‌మెంట్లిస్తూ- ఇలా డావుడీ చేస్తుంటే అప్పుడుగాని దానికి పబ్లిసిటీ రాదు సార్! అప్పుడుగాని కనీసం నాలుగు వారాలాడదు అప్పుడుగాని మాకు నాలుగు డబ్బులు రాగలవు! అంచేత దయచేసి ఏవో కొన్ని కట్స్ సూచించండి!" ప్రాధేయ పడుతూ అన్నాడు విప్లవ్.

సెన్సార్ ఆఫీసర్ నవ్వాడు. "సారీ కుదరదు మీ పిక్చర్‌కి క్లీన్ సర్టిఫికెట్టే ఇస్తాం"

విప్లవ్ కుర్చీలోనుంచి లేచాడు.

"అలా అనకండి సార్! ఇంతకుముందు ఇవే దృశ్యాలు తీసినప్పుడు కట్ చేయమన్నారు బాన్ చేయమన్నారు. కానీ ఇప్పుడు మళ్లీ అవే తీస్తే - క్లీన్ సర్టిఫికెట్ ఇస్తామంటున్నారు చెప్పండి సార్! ఇది కావాలని చేస్తున్న అరాజకం కదూ?"

"సెన్సార్ నిబంధనలు మారాలని మీ నిర్మాతలే అప్పుడు గొడవ చేశారు కదా! అందుకని కొన్ని మార్చారు. ఇదిగో మిస్టర్ విప్లవ్! మేము ఎవరికీ కావాలని ఏమీ చేయము మా ఎగ్జామినింగ్ కమిటీ ఎలా నిర్ణయిస్తే అలా జరుగుతుంది అంతే!

"మా 'అగ్నికణం' చూసిన ఎగ్జామినింగ్ కమిటీ సభ్యులెవరెవరుసార్?"

"ఎందుకు?"

"వారినందరినీ పర్సనల్‌గా కలుసుకుని ఏదో ఒక కట్ సూచించమని ప్రాధేయపడతాను-"

"అదేం కుదరదండీ! ఇంక మీరు వెళ్ళవచ్చు-"

"బాబ్బాబు! అలా కోప్పడకండి! పోనీ ఒక్క కట్ చెప్పండి చాలు"

"కుదరదండీ! మాకు ఎక్కడా తప్పు కనిపించనప్పుడు, నిబంధనలను. ఏ దృశ్యం అతిక్రమించనప్పుడు మేమెందుకు కట్ చేస్తాం?"

"బాబోయ్—అంత మాటనకండి! పెళ్ళాంబిడ్డలు గలవాడిని. మా సినిమా హీరోకి రివల్యూషనరీ హీరోగా ప్రేక్షకుల్లో మంచి పేరుందిసార్! అతనెప్పుడూ బీదలనాదుకుంటాడనీ, ప్రభుత్వాన్ని చీల్చి చెండాడతాడనీ అందరికీ తెలుసు. అలాంటి హీరో సినిమాకు క్లీన్ సర్టిఫికెట్ ఇచ్చారని తెలిస్తే సినిమా ఒక్క వారంలో ఔటయిపోతుంది. అంతే కాదు! ఆ తరువాత అసలు మా సినిమాలు చూడరు."

"అందుకు నేను చేయగలిగిందేమీ లేదు-"

విప్లవ్‌కి ఉక్రోషం, కోపం ఆవే




శం ముంచుకొచ్చాయ్. అక్కడినుంచి చరచరా వెళ్ళిపోయాడు.

మర్నాడు మళ్ళీ నాలుగు టాక్సీలు సెన్సార్ ఆఫీస్ కొచ్చి ఆగాయి.

వాటిల్లో నుంచి విప్లవ్ అతని యూనిట్ సభ్యులు బిలబిల దిగారు.

మరుక్షణంలో వారి కేకలతో ఆ ప్రాంతమంతా దద్దరిల్లిపోసాగింది.

సెన్సార్ బోర్డ్- డౌన్ డౌన్

సెన్సార్ నిబంధనలు- ఇంకా కఠినం కావాలి.

ప్రతి సినిమాకూ ఒక్క కట్ అయినా- విధించాలి.

బాన్ చేయాలా వద్దా అనేవిషయం- నిర్మాతకే వదలాలి!

క్లీన్ సర్టిఫికెట్- ఛీ! ఛీ!

పాత సెన్సార్ నిబంధనలు- జిందాబాద్!

లిబరలైజ్‌డ్ సెన్సారింగ్ పాలసీ- మాకొద్దూ!

సెన్సార్ కత్తెర- జిందాబాద్!

ఆ చుట్టుపక్కల చేరిన జనం కూడా ఉత్సాహంగా వాళ్ళల్లో చేరి కేకలు వేయడంలో యథాశక్తి సాయం చేయసాగారు

క్లీన్ సర్టిఫికెట్- ఛీ! ఛీ!

సెన్సార్ కత్తెర- జిందాబాద్-






రైలు దిగి మేము ఇల్లు చేరేసరికి బాగా చీకటి పడిపోయింది. టయిం ఆరున్నరే అయినా మబ్బుపట్టి ఉండడం వల్లనేమో ఏఎనిమిది గంటలో అయినట్లుంది. బెంగుళూర్లో వాతావరణం సంవత్సరంలో నాలుగు నెలలు ఇలాగే ఉంటుంది.

మేము ఊరు వెళ్ళిన నెలరోజులు మా పనిమనిషి భర్త రాముడిని ఇంటికి కాపలాగా పడుకొమ్మని చెప్పివెళ్ళాము.

అందుచేత వరండా తలుపులు తాళం వేసి వెళ్ళలేదు.

వరండా అంతా చీకటిగా ఉంది. హాలు తాళం తీసి లోపలికి వెళితే తప్ప లైటు వేసుకునే మార్గం లేదు. వరండాలో లైటుకి ఒకస్విచ్చి బయటపెట్టేయించమని కాంతం ఎన్నాళ్ళనుంచో పోరుతూనేఉంది. నేనే పట్టించుకోవడంలేదు.

తాళాలు చేయిజారి కింద పడ్డాయి. చీకట్లో ఎలాగో తడుములాడి వెతుక్కుని, తాళం తీసాను. నా వెనక నుంచొని ఉన్న కాంతం, అమ్మాయి సుజాత, మా జానీ ముగ్గురూ ప్రయాణంలో బాగా నలిగిపోయి ఉన్నారు. ఎప్పుడెప్పుడు ఇంట్లోవెళ్ళి పడతామా అన్నట్లు ఎదురు చూస్తున్నారు అంతసేపూ.

వాళ్ళకేం హాయిగా విశ్రాంతి తీసుకుంటారు. నేనయితే మళ్ళీ కారేజీ పుచ్చుకుని, హోటల్ వెంట పడాలి. ఈ పరిస్థితిలో వంట చెయ్యమని సలహా ఇస్తే, కాంతం నా మీద విరుచుకు పడదూ?

ఉన్నట్లుండి జానీ మూలగటం ప్రారంభించింది. 'ఏం రోగం దీనికి' అనుకుని అటు తిరిగి చూశాను. మూలుగు కాస్తా, చిన్నగా మొరగటంలోకి మారింది. చుట్టూ చూసాము. చీకట్లో నాకేమీ కనిపించలేదు.

లోపలికెళ్ళి వరండా లయిటు వేస్తే తెలిసింది, అసలు సంగతి. వరండా చివర మూలగా పడుకుని ఉందొక నల్లకుక్క. అదక్కడ ఉండడం వాసన పట్టేసనన్నమాట జానీ మూలుగుడు. జానీని సుజాత లోపలికి తీసుకెళ్ళింది. నల్లకుక్క కాంతం దృష్టిలో పడింది. వెంటనే, "ఛీ ఇదెందు కిక్కడుంది? తరిమెయ్యండి దీన్ని" అన్నది అసహ్యంగా ముఖం పెట్టి.

మా వీధిలో మామూలుగా తిరిగే రెండుమూడు కుక్కలు నేను చూశాను. ఇదేదో కొత్తముఖంలా గుంది. కానీ చీకూ, చింతా లేకుండా మూలన ముడుచుకుని ఉన్న తీరు చూస్తే చాలా రోజులుగా ఈ స్థలాన్నితన నివాసం చేసుకున్నట్లుగా అనిపిస్తుంది. మేము వరండా తలుపులు తాళం వేయనందుకే దీనికిక్కడ అలవాటు అయి ఉంటుంది అనుకున్నాను.

"చూస్తారేమిటండీ, దాన్నవతలకి తరిమేసి తలుపు వెయ్యక" అని కసిరింది కాంతం.

ఇంకేమీ ఆలోచించకుండా, ఆవిడ అందించిన కర్ర పుచ్చుకుని 'హేయ్' అని అదిలిస్తూ, నల్లకుక్కని బయటికి తరిమేశాను.

జానీతో సహా మా భోజనాలు అయ్యాయి. నేను హోటల్ నుంచి కేరి

యర్ తెస్తూ వెంబడే పాలూ, బ్రెడ్డూ తేవటం మరిచిపోలేదు.

మా భోజనాల గదిలోనే మా టేబిల్ కి ఎదురుగా ఒక చిన్న స్టూలు, దాని ముందరొక బల్ల ఉన్నాయి.

జానీ స్టూలుమీద కూర్చుని భోం చేస్తుంది అదయినా నేను పక్కన కూచుని ఒక్కొక్క బ్రెడ్డు ముక్కే నోటికి అందిస్తూఉంటే, మధ్యమధ్యలో బల్లమీదున్న గిన్నెలో పాలు తాగుతూ ఆరగిస్తుంది. పాలు గోరువెచ్చగా లేక పోతే తోసేస్తుంది. కంపెనీ లేకుండా భోంచెయ్యదు.

మాకు సుజాత ఒక్కతే అమ్మాయి అయినా, ఈ జానీని ఇంకో పాప గే చూసుకుంటాము. సుజాత కాస్త పెద్ద యాక ఇది చిన్నపిల్లగా మా ఇంట్లో చేరటంవల్లనేమో. మరి త ముద్దు చేయటం అలవాటు అయింది

భోజనాలు అయినవెంటనే కాంతం. సుజాత ఇద్దరూ నిద్ర కుపక్రమించారు. నాకుమాత్రం నిద్ర పట్టలేదు. కాస్సేపు ఊరికే మంచం ద దొర్లి లేచి కూర్చు న్నాను చేతికి అందిన పుస్తక మొకటి తీసుకుని. పడక్కుర్చీ లాక్కుని వరండాలోకి వెళ్ళాను.

నేను లేచి ఇవతలకిరావడం ఎప్పుడు చూసిందో గానీ, సుజాత మంచానికి గజం దూరంలో ఉన్న తన పక్కని వదిలి లేచి, చప్పుడు కాకుండా వచి నా కాళ్ళ దగ్గర కూర్చుంది జానీ

"ఏం చేస్తున్నావు?" అన్నట్లుగా, మెడ పొడవుగా చాచి, నాలుక బయటికి పెట్టి, నా ముఖం లోకి చూసింది. సిగ రెట్ తీసుకు రమ్మని సైగ చేశాను. లోపల టేబుల్ మీదున్న సిగరెట్ పెట్టె, అగ్గిపెట్టె ఒక్కొక్కటిగా తెచ్చిఅందిం చింది నాకు

జానీ ఎప్పుడూ ఇలాగే చేస్తోం టుంది. దానికి తెలివి ఎక్కువ అని పించదు కానీ, బాగా చిన్నవయసులోనే మా ఇంటో చేరటం వల్ల, ఇంట్లోఉన్న ముగ్గురు వ్యక్తుల అలవాట్లు, అవన రాం, మాటలు, చేష్టలు బాగా గ్రహించుకోవటం అలవడింది. ఇలా టీవి దానికి నేర్పటంలో సుజాత మంచి దిట్ట తను చెప్పినట్లల్లా అది నడుచు కోవాలని ఎప్పుడూ తాపత్రయ పడుతూ ఉంటుంది ఒక్కొక్కసారి అది చెప్పి నట్లు తను ఆడుతూ ఉంటుంది. తనకి మిఠాయిలు కొనుక్కుందుకు ఇచ్చిన డబ్బులతో బిస్కెట్లు, ఎకెయిర్లు తెచ్చి వాళ్ళమ్మకి తెలియకుండా దొంగతనంగా జానీకి తినిపిస్తూ ఉంటుంది

ఇద్దరూ కలిసి ఒకేజాతి ప్రాణు ల్లాగా పోట్లాడుకోవటమూ మామూరే. ఏ రోజయినా సుజాత తనకోసం ఏమీ తీసుకు రాకపోతే జానీకి కోపం వచ్చే

స్తుంచి అమ్మాయి స్కూలు బేగు అంతా గెలికి, గందరగోళం చేసే స్తుంచి ఈ గొడవలో. ఏ పుస్తకమో రాస్త చిరిగిందంటే ఆవేశ దానికి పెళ్ళి చేసేస్తుంది సుజాత

సిగరెట్ పీక అవతలకి విసిరేద్దామని గ్రిల్ వరకూ వెళ్ళి ఆశ్చర్యంగా నిలుచుండి పోయాను. కింద పిట్టగోడని ఆనుకుని కూర్చొని ఉంది నల్లకుక్క. దగ్గరగా మనిషి అలికిడి అయేసరికి తల ఎత్తి ఇటువయిపు చూసింది చీకట్లో, చీకటిలా కలిసిపోయిన దాని ముఖంలో కళ్ళు మాత్రం, టార్చిలా వెలుగుతున్నాయి

మూడు గంటల క్రితం నేను తరిమేసినప్పట్నుంచీ ఇక్కడే ఉందో, లేక ఎటయినా వెళ్ళి మళ్ళీ వచ్చిందో గానీ, దాని చూపు, కూర్చుని ఉన్న తీరు చూస్తే, ఇదే తన ఇల్లు అని భావించుకున్నట్లుగా ఉంది.

ఇంతకీ ఇది రాముడి నేస్తం అయుంటాది మరి వాడివెంట ఎందుకు బయటకు వెళ్ళలేదో' లేక వాడు లేనప్పుడు మాత్రం ఇంటికి కాపలా కాస్తూ ఉండిపోయేదేమో'

○○ ○○ ○○

ఉదయం కాంతం కేకలతో మెలకువ వచ్చింది

"ఏ పాడుకుక్క, ఇది ఇక్కడికెలా వచ్చిందో ...సుజా ఆ కర్ర ఇలా ఇవ్వవే దీని పని పట్టాలి" అంటోంది.

కర్ర పుచ్చుకుని 'హేయ్' అంటూ దాని వెంట పడినట్లుంది కాంతం. లేచి బయటికొచ్చాను పెరటి తలుపునుంచీ. ముందర గేటువరకూ దాన్ని తరిమేసి. ఒగురుస్తూ లోపలికొచ్చింది.

"ఏమిటోయ్. పొద్దున్నే హైరానా పడి పోతున్నావ్" తాపీగా పలుకరించాను

"హైరానా కాక మరేమిటి?.. రాత్రి వరండాలోంచి తరిమేశాం కదా అదే నల్లకుక్క మళ్ళీ పెరట్లోకి చేరి అంట్ల గిన్నెల్ని నాకుతూ ఉందండీ"

"అంతేనా? ఏకంగా వంటగదిలోకే జొరబడిందేమో అనుకున్నా నీ కేకలు విని"

'ఇంక అదొక్కటే తక్కువయింది మీకర్ని వేళాకోళాలే ఆ పాడు, దరిద్రం కుక్క. ఇవాళ పెరట్లోకి రానిస్తే రేపు ఇంట్లోకి రాకుండా ఉంటుందా?" అని చిరచిరలాడుతూ లోపలికి నడిచింది కాంతం

ఆ నల్లకుక్క రాత్రంతా మా ఇంటి ముందర కాంపౌండులోనే ఉందనీ, దాన్ని నేను అలాగే ఉండనిచ్చాననీ కాంతంకి చెలిస్తే, ఇంకేమయినా ఉందా? కొంప అంటుకోదూ? అనుకుంటూ, అమ్మాయి గదిలోకి తొంగిచూశాను.



మంచంమీద సుజాత పక్కనే మెత్తని పడకమీద జానీ నిద్రపోతున్నారు.

నాకె తెలీకుండానే, నా మనసు ఈ తెల్ల బొచ్చుకుక్కనీ, బయటున్న నల్ల కుక్కనీ పోల్చి చూసింది. కడుపు నిండుగా భోజనం చేసి, కంటినిండుగా నిద్రపోతున్నది జానీ, తెల్లారి ఎంగిలి మెతుకులు నాకి, కాంతంతో దెబ్బలు తిని పరుగుతీయాల్సి వచ్చింది నల్ల కుక్క. రెండిటి అదృష్టాల్లో ఎంత తేడా ఉంది అనిపించింది.

పనిమనిషి సుబ్బి వచ్చినట్లుంది.

"నీ మొగుడు చూశావా ఏం పని చేశాడో, ఇంటికి కాపలాగా పడుకొమ్మంటే, ఆ నల్లకుక్క నొకదాన్ని తోడు తెచ్చుకుని అలవాటు చేశాడు. అదిప్పుడు మమ్మల్ని పట్టుకుని వదల కుండా ఉంది."

చివాట్లు వేస్తోంది కాంతం. సుబ్బి ఏం జవాబు చెప్పిందో వినిపించలేదు.

ముఖం కడుక్కుని, కాఫీ తాగి మార్నింగ్ వాక్‌కి బయలుదేరాను. ఎప్పుడు, ఎలా చూసి కనుక్కుందో తన్నితీసికెళ్ళమని వెంటబడింది జానీ. దాని మెడకున్న బెల్టుకి గొలుసు తగిలించి పట్టుకుని బయలుదేరాను.

పొద్దుటే గట్టి దెబ్బలు తగిలాయి లాగుంది. వీధిలో గేటు దగ్గరే ముడుచుకు పడుకుని ఉంది.

దాన్ని చూసి 'కుయ్ కుయ్' మంటూ దాని దగ్గరికి వెళ్ళమని గొలుసు లాగుతోంది జానీ. బలవంతంగా ఈడ్చుకుని ముందుకు నడిచాను.

లూప్ రోడ్డుదాటి, ముందుకు వెళ్లాక గానీ, నేను గమనించలేదు. మా వెనకాలే నల్లకుక్క కొంచం దూరంలో

మమ్మల్ని వెంబడిస్తోందని.

మెడకాక బెల్టు, దానికో గొలుసు ఉంది, అది నాచేతిలో ఉన్నా, ఏ అడ్డు లేని దానిలా ఫ్రీగా, గెంతులు వేస్తూ, ఎగురుతూ, అల్లరిచేస్తూ నడుస్తోంది జానీ.

నల్లకుక్క-దాన్ని పట్టుకునేందుకు, ఎటువెళ్ళినా ఆపటానికి ఎవ్వరూ లేరు-అయినా తప్పనిసరి అయినట్లు, పక్కలు చూస్తూ, నెమ్మదిగా నడుస్తోంది.

ఎదురుగా టీ కొట్టు కనిపించింది. నా కాళ్లు నన్ను అటువయిపు లాగాయి. జేబులోంచి చిల్లరతీసి మూడు బన్నులు కొన్నాను. రెండు నల్లకుక్క ముందవేసి, ఒకటి జానీ నోటికి అందించాను. ఇలాంటి తక్కువ రకం తిండి జానీకి అలవాటు లేదు. అయినా నల్లకుక్కకి ఇచ్చినందుకు, గోలపెడుతుందేమోననే దానికీ ఒకటి కొన్నాను.

కానీ ఆ బన్ను దాని నోటికేం రుచిస్తుంది? కొద్దిగా కొరికి చూసి, మిగతా వదిలేసింది. ఆబగా తనకిచ్చినవి రెండూ తినేసి, జానీ మిగిల్చిన ముక్కనికూడా మింగేసింది నల్లకుక్క.

మరో మైలుదూరం నడక సాగించి, ఇంటి దారి పట్టాను. అంతదాకా నల్లకుక్క మా వెంట వస్తూనే ఉంది. కడుపులో తిండిపడిన తర్వాత కొంచం హుషారుగా నడుస్తున్నట్లు కనిపించింది

ఆ వేళ మొదలు, ప్రతిరోజూ మా వెంట వాకింగ్ రావటం, నేను కొని పెట్టే బన్నులు తినటం అలవాటు అయింది నల్లకుక్కకి. దాని కంపెనీ జానీకికూడా అలవాటు అయింది గేటు దాటగానే, తన భాషలో దాన్ని రమ్మని పిలుస్తుంది స్నేహంగా.

ఇదిలా మా వెంట రావటం మా ఆవిడ దృష్టిలో పడనే పడింది.

"దాన్నెందుకు మీ వెంట రానిస్తున్నారు?" అని అడిగిందొక రోజు.

"బాగుందోయ్! పబ్లిక్ రోడ్లో దాన్ని మానాన అది వస్తోంటే రావద్దని ఎల తరిమేస్తాం?" అని దబాయించేశాను.

ఎంతగా కాంతం దాన్ని తరిమి కొట్టినా, ఎలాగో ఆవిడ కన్నుకప్పి, రాత్రయేసరికి గేటుదూకో, గోడదూకో వచ్చి వరండా పిట్టగోడ దగ్గర బైరాయిస్తుంది నల్లకుక్క. ఇంట్లో అంతా సద్దుమణిగిన తర్వాత ఏ కాస్త మిగులు అన్నమో తెచ్చి తనికి వేస్తానని దానికి తెలుసు. అందుకే కాచుకుని చూస్తూ ఉంటుంది ప్రతీ రోజూ.

o o o

మొత్తంమీద కాంతం కోపాన్ని లెక్క చేయకుండా నల్లకుక్కని ఇంటి పరిసరాల్లో ఉండనిచ్చి, అడపాదడపా తిండి పెట్టడం కొన్నాళ్ల పాటు కొనసాగింది.




ఒకరోజు. ఆ వేళ ఉదయం నుంచే మబ్బు పట్టి ఉంది. సాయంత్రం ఆయేసరికి చిన్నచిన్నగా చినుకులు మొదలయాయి. చలికి వణుకుతూ గేటు అవతల ఫుట్‌పాత్ మీద కూర్చుని ఉంది నల్లకుక్క.

అది చీకటి పడగానే గోడ దూకి లోపలి కొచ్చేయటం, చలిలో వెచ్చదనం కోసం టీ తాగుతూ. హాలు కిటికీ లోంచి గమనించాను.

వాతావరణం తీరు చూస్తే రాత్రికి కుంభవృష్టి తప్పేలా లేదు. పాపం నల్లకుక్క తడిసి, చలికి అవస్థ పడుతుందే అనిపించింది. దాన్ని వరండా లోకి రానిస్తే, నిజానికి మాకు కలిగే నష్టం ఏమీలేదు. అంత పెద్ద వరండాలో నా స్కూటరు, నాలుగు పేముకుర్చీలు మాత్రమే ఉంటాయి. ఇంకా బోలెడు స్థలం ఖాళీనే. కానీ కాంతం నోటికి ఎదురుచెప్పగల సాహసం లేదు. నోరు మూసుకుని జాలిపడుతూ కూర్చోవలసిందే.

వర్షం కొద్దికొద్దిగా హెచ్చవుతోంది. ఇంట్లో వాళ్లెవరమూ వర్షం మూలాన సాయంత్రం ఇల్లు వదిలి బయటికి వెళ్ళలేకపోయాము. చేసే పనేమీలేక భోజనాలు త్వరగా ముగించాము.

సుజాత బోర్‌గా ఉందని గోలపెడుతుంటే, క్రితం రోజు చూసిన ఇంగ్లీష్ కథ చెప్పటం మొదలుపెట్టాను. దాని బోర్‌కి కారణం వేరే ఉంది. వాళ్ళ ఫ్రెండ్స్ చాలామంది ఇళ్ళలో టివి లున్నాయి మనమూ ఒకటి కొందాం అని చాలా రోజులుగా గొడవ పెడుతోంది నాకయితే భయం, ఈ పిల్ల

బొత్తిగా చదువు మానేసి టి.వి.కే అంకితం అయిపోతుందేమోనని. అందుకే 'చూద్దాం' అని నానుస్తున్నాను. వెనుక ముందులు ఆలోచిస్తున్నాను. కూతురికి టి.వి. కొనిపెట్టనందుకు, తనకి బోర్ కొట్టినప్పుడల్లా వినోదం కల్పించే పని నెత్తిన వేసుకున్నాను.

కథ చెప్పటం అవగానే అందరం పడకలేశాము. కాంతం అయిదు నిముషాల్లో గుర్రు పెట్టేస్తోంది కానీ నాకు ఎంతకీ నిద్ర రావటంలేదు మంచానికి పక్కనే ఉన్న టేబుల్ లయిటు వెలిగించుకుని, 'ఇండియా టు డే' చేతికి తీసుకున్నాడు.

బయట వర్షం జోరు ఎక్కువయింది. మూసి ఉన్న కిటికీల అద్దాలమీద జల్లు కొడుతున్న శబ్దం బాగా వినిపిస్తోంది. నా కళ్లు అక్షరాల వెంట పరుగులు తీస్తున్నాయన్న మాటేగానీ, మనసు నల్లకుక్కని గురించే ఆలోచిస్తోంది. ఎక్కువసేపు ఆగలేకపోయాను.

చప్పుడు కాకుండా, కాంతానికి నిద్రాభంగం కలగకుండా లేచి తలుపు తీసుకుని, వరండాలోకి వెళ్ళాను. ఎప్పటిలా వరండా గోడ నానుకుని ముడుచుకు పడుకుని ఉంది నల్లకుక్క. కానీ వరండాలో లయిటు వెలిగినా దాన్లో చలనం లేదు.

వానలో తడిసి చలికి ఏ రోగమో రాలేదు కదా అనుకున్నాను. వరండా తలుపు తీసాను. అప్పుడు తలెత్తి చూసింది. లోపలికి రమ్మని సైగ చేశాను. రోకలాడించుకుంటూ లోపలికి నడిచింది. లోపల స్టోర్ రూంలోంచి ఒక గోనెపట్ట తెచ్చి, మూలగా పరిచాను. దానిమీద పడుకుంది నల్లకుక్క. తలుపులు బిగించివెళ్ళి లోపల అంట్ల గిన్నెల దగ్గిర వెతికాను, ఏమీ కన్పించలేదు.

జానీ బిస్కెట్ల డబ్బాలోంచి నాలుగు బిస్కెట్లు తెచ్చి వరండాలో కుక్క ముందర పడేశాను. మళ్ళీ వెళ్ళి పడక ఎక్కితే పుస్తకం పట్టుకోవలసిన అవసరం కనిపించలేదు. హాయిగా నిద్ర పోయాను.

తెల్లవారు జామున మెలకువ వచ్చింది. వర్షం వెలసినట్లుంది. కాంతం ఇంకా నిద్రలో ఉంది. చప్పుడు కాకుండా వెళ్ళి నల్లకుక్కని బయటికి పంపించేశాను గోనెపట్ట తీసి దాచేశాను అమ్మయ్య కాంతంతో చెబితే తప్ప, రాత్రంతా నల్లకుక్క మా వరండాలో ఉన్నదని కనుక్కోలేదు. అనుకున్నాను.

అలా మొదలయిన వర్షం వారం రోజులదాకా వదల్లేదు. ప్రతీ రాత్రీ జోరుగా కురుస్తోంది. రోజూ రాత్రి



# నోటి దుర్వాసన పోగొట్టుకోండి... దంత క్షయాన్ని ఎదుర్కోండి.






కోల్గేట్ తాలూకు నమ్మకమైన ఫార్ములా మీ నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా వుండేలా చేస్తుంది...
మీ పళ్లు ఆరోగ్యంగా, దృఢంగా వుండేలా చేస్తుంది.

**ఎలాగో చూడండి:**



మీ పళ్లలో ఇరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన, దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి.



కోల్గేట్‌లోని అద్వితీయమైన శక్తి గల నురుగు లోతుగా చొచ్చుకుపోయి, హానికరమైన ఆహారపు తునకలనీ, సూక్ష్మజీవులనీ తొలగిస్తుంది.



ఫలితం: ఆత్మవిశ్వాసాన్నిచ్చే తాజా శ్వాస, దంతక్షయం నుంచి రక్షణ, ఆరోగ్యమైన గట్టి పళ్లు.

గుర్తుంచుకోండి, ప్రతిసారి భోజనం కాగానే కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో పళ్లు బ్రష్ చేసుకోండి. నోటి దుర్వాసన పోగొట్టుకోండి...దంతక్షయాన్ని ఎదుర్కోండి.

## దీని తాజా పిప్పరమెంట్ రుచి మీ కెంతో నచ్చుతుంది!

GKBE.B82.96 T.

ఇంట్లో అంతా సద్దుమణిగేక నల్ల కుక్కని లోపలికి రానిచ్చి, తెల్లవారే పంపించేస్తున్నాను.

ఏ రహస్యమయినా ఎన్నాళ్లు దాగుతుంది? ఒక రోజు తెల్లవారి మెలకువ రాలేదు. అంతే కాంతంకి తెలిసిపోయింది! చావుదెబ్బలు తిని పరిగెత్తిపోయింది నల్లకుక్క. దాని అరుపులకి ఒళ్ళు తెలిసిన నేను తేలుకుట్టిన దొంగలా నిశ్శబ్దంగా ఉండిపోయినా కాంతం ఉండనిస్తుందేమిటి?

లేపి కూచోబెట్టి మరీ చీవాట్లు వేసింది.

"మీ కిదేం బుద్ధి. ఆ బజారు కుక్కకి ఇంట్లో ఆశ్రయం ఇస్తున్నారు? దానికిలా అలవాటు చేస్తే, మన జానీ దాని స్నేహంతో చెడిపోదూ? మన మాట వింటుందా తర్వాత. ఇంటికి కాపలా కుక్క కావాలంటే, ఏ అల్సేషియన్ రకందో పట్టుకురండి. నేనొద్దనను. ఇంకోసారిలా చేశారంటే ఊరుకునేది లేదు అని ఝాడించేసింది.

కానీ అదే రోజు సాయంత్రం ఒక విచిత్రం జరిగింది. మధ్యాహ్నం క్లాసుల్లేవని సుజాత ఇంటికొచ్చేసిందట. ఇద్దరూ మాట్నీకి పోతున్నామని ఆఫీస్‌కి ఫోన్ చేసి చెప్పింది కాంతం.

ఆరుగంటలకి ఇల్లు చేరుకున్నాను. బిక్కు బిక్కుమని ఇల్లంతా తిరుగుతున్న జానీని పలకరించి, పాలు, బిస్కెట్లు ఇచ్చాను. కాఫీ పెట్టుకుని తాగేను.

చిరుచీకటి పడుతుండగా కాంతం, అమ్మాయీ ఇంటికొచ్చారు. వాళ్ళ వెనకాలే నల్లకుక్క గేటు దాటి లోపలికి రావటం, అయినా దాన్ని కాంతం ఏమీ అనకపోవటం గమనించాను.

నేను ఆశ్చర్యంలోంచి తేరుకునే లోపలే లోపలి కొచ్చిన కాంతం, "అబ్బ ఇప్పటికిప్పుడు ఎంత ప్రమాదం తప్పిందనుకున్నారు" అని మొదలు పెట్టింది. "అసలేం జరిగిందంటే" అంటూ మరో పక్కనించీ సుజాత ప్రారంభించింది. ఫ్లాస్కులో ఉన్న కాఫీ కప్పుల్లో పోసి ఇద్దరికీ ఇచ్చి, అసలు సంగతి కనుక్కున్నాను.

సినిమా హాలు దగ్గిరే కదా అని, ఆటో ఎందుకులే అనుకుని తల్లీకూతుళ్ళిద్దరూ నడిచే బయలుదేరారట.

మా ఇంటికి ఫర్లాంగు దూరాన మొదలయే లూప్ రోడ్‌లో అంతగా జనసమ్మర్దం ఉండదు. రోడ్డు వెంట ఉన్న కాంపౌండ్‌లలో ఎక్కడో లోపల ఉన్న లంకంత ఇళ్ళలోంచి అయినా ఏ శబ్దాలూ విన్పించవు.

వీళ్ళిద్దరూ ఆ రోడ్డమ్మట నడచి వస్తోండగా ఒక దొంగ వాళ్ళని అటకాయించాడట. మెడల్లో, చెవుల్లో, చేతుల్లో ఉన్న బంగారం అంతా ఒలిచి ఇయ్యమని బెదిరించాడట. వీళ్ళిద్దరూ దిక్కు



తెలియక కేకలు వేసారు కానీ, విని పించుకునేదెవరు?

సరిగ్గా అప్పుడే ఎక్కడినుంచో నల్ల కుక్క పరుగెత్తుకొచ్చి దొంగవాడి మీద ఎగిరిపడి మొరగటం మొదలు పెట్టింది. అది ఒకటి రెండు చోట్ల వాడి కాళ్ళ మీద కరిచే సరికి, ఒకటే పరుగు లంకించేశాడు దొంగ అయినా వదల కుండా వాడివెంట అరఫర్లాంగు దూరం పరుగెత్తి వెనక్కి వచ్చింది నల్లకుక్క.

ఇదీ జరిగిన కథ. ఈ సంఘటనతో నల్ల కుక్క పట్ల తన అభిప్రాయం కొద్దిగా మార్చుకుంది కాంతం.

"చూశావా? దానికెంత విశ్వాసమో మనమంటే. దాన్ని ఎందుకు రానిస్తా రని ఎగుర్తావే నామీద" అన్నాను అవ కాశం వృథా పోనియ్యకుండా.

"అవునండి. నిజమే మీ మాట" ఒప్పేసుకుంది కాంతం.

అది మొదలు నల కుక్కకి మా వరండాలో స్థిరనివాసం దొరికింది. రెండు పూటలా తిండీ దొరుకుతోంది

o o o

నల్ల కుక్కని చేరనిచ్చినందుకు కొత్త చిక్కొకటి వచ్చి పడింది ఇంట్లో.

మా జానీకీ, దానికీ సహజంగా స్నేహం ఎక్కువయింది. ఇది మా కాంతానికిష్టం లేదు రెండింటిని దూరంగా ఉంచేందుకు ఆవిడ చేసే ప్రయత్నాలు చూస్తే నాకు నవ్వు వచ్చేది.

మనుషులకి మల్లే, ఈ అంతస్తు, కులం, మతం భేదాలు కుక్కల్లో కూడా




కున్నాను.

ఆవేళ నించీ జానీ నల్లకుక్క దగ్గరికి వెళ్ళకుండా కట్టుదిట్టాలు యెక్కువయాయి మా ఇంట్లో.

పది రోజులు గడిచేసరికి నా అంచనా తప్పని తేలిపోయింది. నల్లకుక్క ఒంటిమీద కురుపులు రోజురోజుకీ యెక్కువవుతున్నాయి. చాలా [illegible]కు యెప్పుడూ పడుకునే ఉంటుంది.

ఆవేళ సాయంత్రం ఇంటికి రాగానే చూస్తే వరండాలో మూల ఖాళీగా ఉంది. 'ఏదేమి?' అన్నట్లు చూసాను తలుపు తెరిచిన కాంతం వయిపు.

"తన్ని తరిమేశాను, మళ్ళీ ఈ ఛాయలకి రాకుండా" ఏమిటి, యెందుకు అని అడగవలసిన అవసరం లేకుండానే చెప్పేస్తోంది కాంతం.

"దానికి రోగం బాగా యెక్కువయిపోయిందండీ. అసలు దాన్ని మనమెప్పుడో తరిమేయాల్సింది. పోనీ అని ఉంచుకున్నందుకు ఇవాళేమయిందో తెలుసా? మన జానీ యెలాగో గొలుసు తెంచేసుకుని వెళ్ళి ఆ దరిద్రపు కుక్క పక్కన చేరింది. మధ్యాహ్నం ఇంట్లోకి రమ్మని యెంత పిలిచినా రాదే. ఇంక లాభం లేదనుకుని నల్లకుక్కని నాలుగు తన్ని తరిమేసి, దీన్ని బలవంతంగా లోపలికి లాక్కొచ్చాను"

ఘనకార్యం చేసినట్లుగా చెబుతోంది కాంతం. తప్పు చేసింది జానీ అయితే, శిక్ష నల్లకుక్కకన్నమాట అనుకున్నాను. మా ఇంట్లో ఏ విషయంలో అయినా కాంతం నోటిమాటే వేదవాక్కు. ఆవిడ నిర్ణయమే న్యాయమూ, ధర్మమూను. ఇందులో మాత్రం

రాకుండా యెలాపోతుంది?

ఆవేళ ఆఫీస్‌లో మిగిలిపోయిన కొన్ని అర్జంటు ఫైళ్ళని ఇంటికి తెచ్చుకున్నాను. ఇంటికి వచ్చినది మొదలు రాత్రి పన్నెండింటిదాకా వాటితో కుస్తీ పడుతూ కూర్చున్నాను. మధ్యలో ఒక్క అరగంట మాత్రం భోజనానికి లేచాను.

బాగా అలసిపోయానేమో మొద్దు నిద్ర పట్టేసింది మెలకువొచ్చేసరికి ఏడు గంటలయింది కానీ చలికాలం కావటం చేతనేమో యెండ పొడ కన్పించటం లేదింకా. అలవాటు చొప్పున జానీని వెంటబెట్టుకుని వాకింగ్ బయలుదేరాను.

గేటు దాటగానే నా కళ్లు నల్లకుక్క కోసం వెతికాయి అది ఆ చుట్టు పక్కల యెక్కడా కనిపించలేదు. నాల్గడుగులు వేశాను.

అటుగా ఒక వీధులూడ్చే అతను చిన్న చెత్తబండిని కష్టంగా తోసుకు వెళుతున్నాడు. అంత బరువు అందులో ఏముందా అని దగ్గరికి వెళ్ళి చూశాను.

అందులో ఉన్నది నల్లకుక్క.... ఊహూ కాదు ... దాని కళేబరం.

నా అడుగులు అక్కడే ఆగిపోయాయి. ఆ చావులో నాకూ బాధ్యత ఉందేమో అనిపించింది. దానికి మొదట రెండు కురుపులు కనిపించగానే డాక్టర్‌కి చూపించి ఉంటే.... ఇలా అయేదికాదు గదా అనిపించింది

నేను మాత్రం కాంతానికేం తీసిపోయాను? కుక్క అన్న తర్వాత ఏదయినా ఒక్కటే అన్న సామ్యవాదాన్ని మనసులోనే సమాధి చేశాను కానీ, పైకి చూపిందేమాత్రం?

బండివెంట వెళదాం రమ్మని లాగుతోంది జానీ. దాన్ని బలవంతంగా లాగి, ఇంటి దారికి మళ్ళించాను. ★





# శ్రీ శ్రీ పదబంధ ప్రహేళిక-4

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ■ | 1 | ■ | 2 | | 3 | ■ | 4 | ■ |
| 5 | | 6 | | ■ | 7 | 8 | | |
| ■ | 9 | | ■ | 10 | ■ | 11 | | ■ |
| 12 | | ■ | 13 | | 14 | ■ | 15 | 16 |
| | ■ | 17 | | ■ | 18 | | ■ | |
| 19 | 20 | ■ | 21 | 22 | | ■ | 23 | |
| ■ | 24 | 25 | ■ | | ■ | 26 | | ■ |
| 27 | | | 28 | ■ | 29 | | | |
| | | ■ | 30 | | | ■ | | ■ |

### ఆధారాలు...అడ్డము

2. ఇంకోరకం శిరచ్ఛేదం రూపొందే [illegible] 5 మనిషికి [illegible] మాసురా? 7 పాశ్చాత్యులకి అరిష్టసూచకం 9 నడుంలేని నాణెం 11 మరో హిరణ్యాక్షుడి విరునామం 12 నామాలతో దస్తావేజులు 13 తినగ తినగ తీయన 15 దీనికి లేనిది ఇంకోదానికా? 17 అహింసావాదులకు అక్కర లేనిది 18 ఉపాహారానికి తిక్కన 19. అతిశయం 21 ఉండడానికి చోటు 23 ఆరు సిరాలు 24. మద్యం (దేవతలకా?) 26 ఆఫ్రికాలో ఒకదేశం 27 తెనాలి రామన్న వెక్కిరించిన పెద్దన ప్రయోగం 29 అవతార పురుషుని ఆయుధం 30. మణి విశేషం.

### నిలువు

1. పరమేశ్వరునితో పార్వతి 2. కోటాను కలిసి లెక్కకు మిక్కిలి 3. అనుబంధంతో జాలి 4 గుంపుతో సంబంధించినది 6. లేక, ఇంకా కావాలా? 8 రెండు సంగీత స్వరాలు 10. కట్టడం అంటే మరణం 12 గాలి 13 అపదినం నవోదయం 14. సుమతి శతకం ఇతడు చదవకూడదా? 16 తీస్తే పరుగు చేస్తే దాడి 20 రత్నగర్భ 22 జవాబడిగేది 23 అంతమించిన దురాచారం 25. ఆమ్రేడితంలో పోటీ 26 మద్దితో ఒక వూరు 28. ఏడావ 29 ఇకమీద రెండులేని మూడోయుగం




ప్రాంతంలో నిత్యం కరువు సరైన నీటి వనరులు లేవు పంటలు పండవు. అతి తక్కువ ఆదాయం వచ్చే చిన్న చిన్న వృత్తులే జీవనాధారం సెంట్రల్ టెక్సాస్ (లారీ వుండే ప్రాంతం యిదే) లో ప్రతి ఆరోవాడు అతి పేదరికపు స్థాయికి క్రిందుగానే బతుకుతున్నాడని అధికార ప్రకటనలే తెలుపుతున్నాయి. అలాంటిచోట అయిదు వందల డాలర్లంటే పెద్ద మొత్తమే. జీవితానికి సాహసం, వినోదం అవసరమే కానీ మనిషి మనుగడ బలహీనతల ఆధారంగా జరిగే యీ రకపు అమానుష వినోదాల్ని తలుచుకుంటే, వింటే కొందరు మానవత్వం మరచి పోయారేమో అన్న అనుమానం రాకపోదు

పాముకాటుకి గురై స్పృహ కోల్పోయేముందు చుట్టూ వున్న జనాన్ని చూసి ... వాళ్ళందరి దృష్టికి తను కేంద్రం అయ్యానన్నది గ్రహించి గొప్పగా యింకా ఏదో చెయ్యాలని వృథా ప్రయత్నం చేసిన అతని మానసిక స్థితే చాలు.. జనం ఎంతటి కృతక స్థాయిలో, ఎంతటి ఫాల్స్ ప్రిస్టేజిలో బతుకుతున్నారో తెలపటానికి.

ప్రమాద కారణంగా లారీ జీవనస్థాయి మరింత పడిపోయింది అవకర మైన చెయ్యితో అతని బతుకు మరింత భారమైంది. వినోదం వెర్రితలలు వెయ్య కుండా జాగ్రత్తపడడం సమాజ ఆరోగ్యానికి ప్రథమ సోపానం. ★

# బంధితులు

## వై.ఎస్.మురళీధర్

"ఛీ! వదలండి జడ"

"వదలమంటుంటే . అత్తయ్య పిలుస్తారు. వెళ్ళాలి. ప్లీజ్. ."

గదిలోంచి జయ మాటలు వినిపిస్తున్నాయి. ఆశ్చర్యం వేసి కర్టెన్ తొలగించి చూశాను.

జయ మంచం మీద పడుకుని ఆసక్తిగా చదువుతోంది నవల.

కర్టెన్ చప్పుడుకు చటుక్కున తలెత్తి నన్నుచూచి దిగ్గున లేచి నిల్చుంది.

"నువ్వే నా అమ్మా! అబ్బాయి వచ్చాడేమోనని ..." అన్నాను.

ఆమె నావంక చురచురా చూపి వంటింట్లోకి వెళ్ళిపోయింది.

మంచంమీద పడున్న ఆనవలవైపు ఆమె వెళ్ళినవైపు నిస్సహాయంగా చూపి వరండాలోకి వచ్చి నించున్నాను

ఉదయం పట్టిన ముసురు చీకటి పడినా తగ్గలేదు. జల్లులు జల్లులుగా పడుతోంది వర్షం దూరంగా వెలుగు తున్న ఆ ఒక వీధిదీపం కూడా వర్షంలో గుడ్డిగుడ్డిగా కనబడుతోంది.

అబ్బాయి వస్తాడని అలా నిలబడి ఉన్నానేకాని వాడు అప్పుడే వస్తాడా? టౌనునుంచి రెండు మైళ్ల సైకిలు తొక్కాలి!

"భోజనం వడ్డించాను" లోపలి నుంచి జయ కేక పెట్టింది.

"వస్తున్నా. "

అంతా పొడిపొడి సంభాషణలే.

"నువ్వెళ్ళమ్మా! నే వడ్డించు కుంటాలే"

అక్కణ్ణించి వెళ్ళిపోయిందావిడ.

ంం ంం ంం

"అన్నం పెట్టు!" అరిచాడు రామం

## ఏప్రిల్ నెల పజిల్‌కి సొల్యూషన్

### అడ్డము

1. ప్రధాని 3. వేసవి 5 సిరి 7. పాదం 8. మఖ 10. వ్వనలే 11 తీరు 12. రచన 14. రువారం 16. పోతన 18 పిడుగు 20. ఆరు 21. టక్కరి 22. ట్టుక 24. కోన 25. కి.మీ. 27 సంక్రాంతి 28. దసరా.

### నిలువు

1. ప్రతిమ 2. నిసి 3. వేదం 4. వినరు 6. రివ్వన 7. పాలేరు 9. ఖర 11. తీరం 13 సమత 15 వాగడు 16 పోరు 17 నటన 18. పిరికి 19. గుట్టు 20. ఆయసం 23. కలరా 24. కోతి 26. మీద.

### విజేతలు

ఆర్. శ్రీమన్నారాయణశర్మ, నల్లగొండ, పి. సరస్వతి, రాబర్ట్‌సన్ పేట, ఎన్.సి.హెచ్ జగన్నాధాచార్యులు కొత్తగూడెం, ఆర్. శారద, హైదరాబాద్, డి. భాగ్యలక్ష్మి, ఖమ్మం; అలపర్తి లక్ష్మీతులసి, నందివెలుగు; ఎన్. గోపీచంద్, కందుకూరు, నేహాన విజయలక్ష్మి, విశాఖపట్టణం, ఎన్. నరసింహాచారి, హైదరాబాద్, కె ఎస్ రామారావు, విజయవాడ, వి. నాగరాజు, నెల్లూరు; ఆర్ వెంకటేశ్వర్లు, హైదరాబాద్, అలపర్తి రత్నకుమారి, నందివెలుగు; జ్యోతి ప్రభాకర్, కర్నూలు, ఎన్ వి చలమారెడ్డి, జమ్మలమడుగు, సి వెంకటేశ్వరరావు, పాల్వంచ, టి. వెంకటప్పారావు, పాల్వంచ, వి.వి పార్వతీశం, వరంగల్; ఎ. శ్యామలాదేవి. శ్రీకాకుళం; పి. సరస్వతి, మల్కిపురం, టి జయలక్ష్మి, నగరం, వి. నాగభూషణం, పీలేరు, కె వి.యస్ సిద్ధాంతి, హైదరాబాద్, సి వి.కె.నె శర్మ, రాజంపేట, పి. ఉషారాణి. కాకినాడ పి వి రామారావు, ఖమ్మం, పాతూరి అప్పారావు. నగరం, పి.వి. కృష్ణయ్య, హైత్రేరు; సోమంచి సుబ్బలక్ష్మి, విజయనగరం, ఆకెళ్ళ సీత, బొంబాయి; ఎమ్. శివరామమూర్తి, విశాఖపట్టణం; డి వసుంధర, కావలి, బి రుక్మిణి, హనుమకొండ, సామంచి ప్రభాకరరావు, విజయనగరం.




# విషసర్పాలతో వినోదం

**రేటిల్ స్నేక్ పొడపాములా వొంటి నిండా గోధుమ వర్ణం మచ్చలతో......**

వెడల్పయిన నోరుతో . మూడు నాలుగు అడుగుల పొడవుగా వుంటుంది యీ విష సర్పం ప్రత్యేకత దాని తోక తోక కదిలిస్తే చాలు గలగలా విపరీతమైన చప్పుడొస్తుంది యీ రేటిల్ స్నేక్స్‌కి టెక్సాస్ ప్రసిద్ధి ఇలాంటి భయంకర సర్పాలతో కలిసి వో సంచీలో దూరి కొన్ని గంటలు పడుకోటం, నెత్తిమీద చుట్టకుదురులా పెట్టుకుని తిరగటం నగ్నంగా శరీరమంతా పాకించుకోటం యిలాంటి వినోద ప్రదర్శనలు టెక్సాస్‌లో ఎప్పట్నించో వున్నాయి. పోతే యిప్పుడు యీ రేటిల్ స్నేక్స్‌తో కొన్ని పోటీలు, వాటికి బహుమతులు.. యీ తతంగం నిర్వహించటానికి కొన్ని క్లబ్బులు వెలిసాయి యీ రకం పాముల్తో అనేకరకాల ప్రమాదకర ప్రదర్శనలిచ్చిన ఘనత కలవాడు లారీవెబ్ స్లీపింగ్ బేగ్‌లో యాభై పాముల్తో కలిసి చుట్టచుట్టుకుని కొన్ని గంటలు కలిసి పడుకుని గతంలో రికార్డు సృష్టించిన "లారీవెబ్" పాల్గొంటున్న ఓ పోటీ అది

టెక్సాస్‌లోని బ్రౌన్‌వుడ్‌లో "హార్ట్స్ ఆఫ్ టెక్సాస్ స్నేక్ క్లబ్" నిర్వహిస్తున్న ఎనిమిదవ వార్షిక రేటిల్ స్నేక్ రౌండ్ అప్ పోటీ అది 3 × 4 మీటర్ల వైశాల్యం గల నుయ్యిలాంటి గుండ్రటి స్థలం చుట్టూ ఉన్న ప్రేక్షకులకి చూట్టానికి వీలుగా వుంటుంది అందులో పది పాముల్ని వదుల్తారు పాముల్ని పట్టుకునే మనిషి ఒకరు, ఆతను పట్టుకున్న పాముల్ని భద్రపరచటానికి గోనె సంచీ పట్టుకుని కూడా వుండే సహాయకారి మరొకరు. ఎంత తక్కువ టైములో ఆ పాముల్ని పట్టుకుని గోనె సంచీలోకి ఎక్కిస్తే వాళ్లు గెలిచినట్టు.. బహుమతి 500 డాలర్లు పాముల విజేత అన్న బిరుదు. అరవై సెకన్ల కన్నా తక్కువ సమ



కాకీ చొక్కా గుండీలు విప్పుతూనే.

"పెట్టే ఉంచాను!" తిరిగి అంతటి స్వరంతోను జవాబిచ్చింది జయ.

రెండు క్షణాలు నిశ్శబ్దం. తరువాత పీట వాలిన చప్పుడు.

"కూర ఇలా తగలడ్డాదేవిటి?"

"....... ......."

"అన్నం చచ్చిపోయినట్టుంది."

"... ....... ......."

"ఏమిటి మాట్లాడవ్?"

"ఏం మాట్లాడను?"

"మనుషులు తినటానికా, పశువుల కని వండేవా?"

"పశువుల " ఆగిపోయి, "మనుషులే తింటున్నారుకదా!" అంటూ గొణిగింది.

"అక్కడే సణుగుతూ కూర్చోక పోతే ఇక్కడ చావరాదా!"

"చావవలసినఅవసరం నాకులేదు."

"మాటకు మాట చెబుతున్నావ్. తలనిండా పొగరెక్కింది."

"హుఁ."

"నెయ్యేదీ? ఇక్కడి కనిపించటం లేదే."

"నెయ్యి అయిపోయింది."

"ఇలావస్తావా! అక్కడే చస్తావా?"

తడబడుతున్న అడుగుల చప్పుడు. తరువాత సరుకుల బీరువా తలుపుతీసిన కి్రరుమనే శబ్దం ఆ తరువాతి నిముషంలోనే దభీమని ఏదో పడిపోయిన శబ్దం వినిపించింది.

గబగబా అక్కడికి వెళ్ళాను.

జయ చేతిలోంచి పచ్చడి జాడీ జారిపోయింది.

రామం పెద్రేగిపోతున్నాడు.

౦౦ ౦౦ ౦౦

"ఇదేమిటీ! ఈ నవలెక్కడిది?"

"... . ... "

"నవల్లు చదవమని ఎవడు చెప్పాడు?"

"ఎవడు చెప్పాలి?"

"ఆఁ.." కోపం నిగ్రహించు కున్నాడు. "నవలలు చదవొద్దని ఎన్ని సార్లు చెప్పాలి "

"... ... .... . "

"నువ్వు నవలలు చదవటం నా కిష్టం లేదు."

"నాకిష్టమే"

"నీ ఇష్టాయిష్టాలు ఎవడిక్కావాలి? బోడి ఇష్టాయిష్టాలు!"

"బోడికి."

ఏమిటే! నన్ను బోడి అంటావా? నిన్నూ. "

రామం విసురుగా వెళ్ళి జయఎడమ చెయ్యి వెనక్కి మెలితిప్పి, జడతో ఒక చుట్టు చుట్టాడు. తరువాత కుడి చెయ్యి కూడా మెంతిప్పి మిగిలిన జడతో వెనక్కి విరిచి కట్టాడు. ఇంత జరిగినా జయ "అమ్మా ." అని వినబడీ వినపడనట్లుగా గొణిగింది.

జయను గది మధ్యకంటూ పడి పించుకు వచ్చాడు. ఆమెకు ఎదురుగా నిలబడి, "చూడు! ఇప్పుడు నిన్నేం చేస్తానో" అంటూ బలంగా వెనక్కి ఒక్క తోపు తోశాడు ఈ దూరాత్మరి జామా కి తట్టుకోలేక "అమ్మోయ్" అంటూ వె్రరకేక వేసి, ఒక మూలకు పడిపోయింది. ముందుకు లేవాలని ప్రయత్నించి మళ్ళీ పడిపోయింది. కాలు మెలితిరిగి ఉంటుంది.

"ఇప్పటికన్నా అణిగిందాపొగరు!" అంటూ తిరిగి టేబుల్ మీదున్న నవలను కసిగా చేతిలో తీసుకున్నాడు నవలను నగానికి విడిగా పట్టుకుని, ఇదిగో ఇకనుంచి ఈ ఇంట్లో నవలలు కనబడ్డాయా- ఇంతే సంగతులు!" అంటూ సర్రున చింపబోయాడు.

"ఆగండి' చింపకండి."

ఆమెలో వచ్చిన ఈ మార్పుకి సంతోషించాడు.

"ఏం? ఎందుకు చింపకూడదు'"

"ఆ నవల మనదికాదు "

"ఎవరిది?"

"ఉషాబాలది."

"ఉషాబాల " ఆ మాటవింటూనే ముఖం తేపురించింది. "అది ఇక్కడి కెందుకు వచ్చింది'"

"మధ్యాహ్నం .. కాలక్షేపానికి ఇచ్చింది "

"అలాగా మధ్యాహ్నం వచ్చి నవల్లు సరఫరా చేసి వెళుతోందా?"

" .. "

"అసలు నీకది ఎలా తెలుసు'"

"చిన్నప్పుడు కలిసి చదువు కున్నాం "

"ఓహో! ఒకే బళ్లో చదివారన్న మాట "

"హుఁ " అంటూ నిట్టూర్చింది

"మా పోలీస్ స్టేషన్‌కు వారాని కొకసారి దాన్ని పట్టుకొస్తారు."

"నాకు తెలియదు" మతి పోయినట్టు చూస్తూ అంది.

"నీకు తెలుసనుకుంటున్నాను." అన్నాడు ఎగతాళిగా.

"ఏమిటి మీరనేది?"

"ఒకే బళ్లో చదివినవాళ్ళకి ఆ మాత్రం తెలీదా అని"

సన్నగా మూలుగుతూ ఏడుస్తున్న శబ్దం. కొంచం సేపటికి ఏడుపు ఆగి పోయింది. వెక్కిళ్లు వినబడుతున్నాయి.

అవతలి వ్యక్తి నరం దొరికింది రామానికి. ఇక తను ఆడించినట్టు ఆడ టం తప్ప ఆమె చెయ్యగలిగిందేమీ లేదు.

"ఎన్నాళ్ళనుంచి ఈ రావటం?"

"వారం రోజుల్నుంచి"

"ఓహో' అంతకుముందు రెండేళ్ళ నుంచి ఇక్కడ నిన్ను చూడలేదన్న మాట అయితే వన్‌వే ట్రాఫిక్కైనా లేకపోతే. "

"అంటే "

"తనే వస్తోందా ? నువ్వు కూడా వెళుతు "

"తనే వస్తోంది. నాకు ఆవిడ ఇల్లు తెలీదు"

"అదా సంగతి తెలిస్తే వెళ్ళే దానివే!"

వెక్కిళ్లు వినబడుతున్నాయి.




"ఇదిగో ఇవాళ చెబుతున్నాను సరిగా విను - ఆ ఉషాబాలొచ్చినా, నా కంట ఈ నవల్లు కనబడినా ముక్కలిరగ్గొట్టే స్తాను" కొంచెం సేపు ఆగి, "అర్థం అయిందా" అన్నాడు అవతల నుంచి జవాబుగా వెక్కిళ్లు, ఏడుపు కలిసి విన బడుతున్నాయి

ఏదో సాధించిన వాడిలాగ గర్వంగా ఆమె కళ్ళల్లోకి చూసి పుస్తకాన్ని ఆమె వైపు గిరవాటు పెట్టాడు

తరువాత వీధిగుమ్మం దగ్గరకువచ్చి నిలుచున్నాడు పొరుగిళ్ళలో కిటికీల దగ్గర నిలబడ్డ ఆడవాళ్లు తలుపులు వేసు కోవడం చూసి చిరునవ్వు నవ్వు కున్నాడు

నా మనసంతా వికలమైపోయింది.

సుశీలే బతికుంటే ఈ రామం ఇలా తయారయ్యే వాడా వాడి అయిదో సంవత్సరంలోనే ఆమె పోవటం, ఆ తరువాత సంవత్సరం తిరగకుండా ఇను మళ్ళీ పెళ్ళి చేసుకోవటం - ఆ వచ్చి నావిడ ఎనిమిదేళ్లు సాధించి మరీ చని పోవటం జరిగింది

అప్పట్నుంచీ ఆడవాళ్ళమీద వాడికున్న కసి ఇంతా అంతా కాదు. నేను ఒకటి రెండుసార్లు వాడి మాటలు చాటుగా విన్నాను

"ఒరే గోపాలం ! ఆడవాళ్ళకు ఎప్పుడూ రాస్త కూడా అలుసివ్వకూడ దురా ! ఇచ్చావో చూసుకో - నెత్తిమీద కూర్చుని చండశాసనులై పోతార్రా ! వాళ్ళని చెప్పు కింద ధనియాలు నలిపి నట్టు నలపాలి అప్పుడే మన అడుగు లకి మడుగులొత్తుతారు" అని తన స్నేహితుడొకడికి చెబుతున్నాడు పైగా చేసే కానిస్టేబులు ఉద్యోగం వాడికి

మరింత కర్కశత్వాన్నిచ్చింది

వీధి గుమ్మం తలుపు తీశాను మోరంగా కేశవస్వామి గుడిలో పాడుతున్న భజన గీతాలు వినిపిస్తున్నాయి తాళం లయబద్ధంగా వినబడుతోంది.

ం ం ం

నిర్వికార స్వామి నెల రోజులున్నించి కేశవస్వామి గుళ్ళో ఉంటున్నారు ఆయన వచ్చినప్పటి నుంచి భజన గీతాలు పాడటం వాటికి నేను తప్పని సరిగా వెళ్ళడం అలవాటు. వర్షం రాని రోజున ఊరిరైతులు ఇంకొంతమంది హాజరవుతుంటారు

నేను వెళ్లేసరికి అరడజను శిష్యుల మధ్య కూర్చుని పాడుతున్నారు.

నన్ను చూస్తూనే సాదరంగా ఆహ్వానిస్తూ, "ఎలా వచ్చావు నాయనా కాళ్లు కడుక్కోవటానికి నీళ్లు కూడా అయిపోయినట్టున్నాయే" అన్నారు.

ఆయనకు నా వయసే ఉన్నా నన్ను నాయనా అనే సంబోధిస్తారు

"పర్వాలేదండి నా కాళ్ళకు బాడి అంటలేదు" అన్నాను - తడిగా ఉన్న అరికాళ్లు మెట్లమీద ఉన్న గోనెపట్టాకు తుడిచివేస్తూ.

"పక్క వీధులన్నీ బురదతో నిండి ఉంటాయి కదా!"

నేను నవ్వి, "మావాళ్లు కాళ్ళకు బురద అంటకుండా ఇటిక ముక్కలు, పెంకు ముక్కలు వేస్తారు. జాగర్తగా నడిస్తే బురద అంటదు" అన్నాను.

ఆయన ఒకింత సేపు మౌనంగా ఊరుకున్నారు.

"మేం ఈ ఊరు వదిలి వెళ్ళిపోతున్నాం నాయనా!"

ఉలిక్కిపడ్డాను

"అదేమిటి స్వామీ! ఇంత హఠాత్తుగా వెళ్ళిపోవటం ఎందుకు?"

"హఠాత్తుగా ఏమీకాదు నాయనా! నేను ఈ ఊరువచ్చి నెలరోజులు దాటిపోతూంది. ఒకే ఊళ్లో ఇన్నాళ్లుండటం ఏం బావుంటుంది. ఉదయానికి ముసురు తెరపి ఇస్తుంది. రేపు ప్రయాణమై పోతాము ఊర్లో అందరకూ ఇవ్వాళ తెలియజేశాము. మీరు తప్పక ఇక్కడికి వస్తారు కనుక నేనే చెబుదామని ఊరుకున్నాను"

"అరె!" అని మాత్రం అనగలిగాను

"ఇవ్వాళ ఆఖరు రోజుకదా ముసురు ఇలా ఉన్నప్పటికీ రాత్రంతా భజన గీతాలు పాడాలని నిశ్చయించుకున్నాం. తెల్లవారు జామున కొంచెం సేపు విశ్రాంతి తీసుకుంటాం"

నాకూ ఇంటికి వెళ్లాలనిలేదు. ఇంటికి వెళ్ళగానే అన్నీ గుర్తువస్తాయి. ఇక్కడే ఉంటే మనశ్శాంతిగా ఉంటుంది.

"నేనుకూడా ఈ రాత్రంతా జాగా

రం చేస్తాను. ఈ రాత్రికి ఇక్కడే ఉండిపోతాను"

ఊళ్లోంచి ఒక్కళ్లు కూడా భజన గీతాల్లో పాల్గోటానికి రాని సమయంలో నేను రాత్రంతా ఉంటానన్నందుకు ఆయన అభినందిస్తారనుకున్నాను. కాని నా మాటలకు ఆయన కళ్ళల్లో లేశ మాత్రమైనా ప్రశంస కనిపించలేదు.

కొంచెం ఆగి ఆయన ఇలా అన్నారు.

"ఊర్లో వారంతా చాలా ఉదారులులా ఉన్నారు మేమంతా రేపు ఉదయమే బయలుదేరి పోతామని తెలుసుకుని, ఈ ముసురులో బయటకు రాలేకపోయినా - మాకు పదిహేను రోజులదాకా ఏమి ఇబ్బంది కలుగకుండా సరిపడేంతకు దక్షిణలు సమర్పించుకున్నారు" అన్నారు వేలితో ఒక మూలగా ఉన్న బియ్యం బస్తాలను చూపిస్తూ

ఆయన మాటల్లో ఏమన్నా వ్యంగ్యం ఉందేమో ఒక పట్టాన అర్థం కాలేదు

నాకు తెలీకుండానే నాలో ఏదో ... హీనత రాజుకొంటూంది

నేను వెంటనే "నన్ను నేనే ... వారికి సమర్పించుకుంటున్నాను" అని అన్నాను అవును ... మధ్య మన శాంతి లభించేది ... వీరితో శాశ్వతంగా ఉండి పోవాలనుకోవటం స్వార్థమా? లేక త్యాగమా?

---

ఆయన చాలా సేపు మాట్లాడలేదు నా ముఖంలోకే చూస్తూ కూర్చున్నారు. నేను తలవంచుకు కూర్చున్నాను. ఈ మౌనం అంతా నన్ను అవగాహన చేసుకోవడానికి వినియోగించి ఉంటారు.

తరువాత నెమ్మదిగా ఇలా అన్నారు.

"ఎందుకు నాయనా! ఈ మధ్య విచారంగా ఉంటున్నావు?"

"ఏం చెప్పమంటారు! చెప్పకూడని సమస్యలేవో ఎదురవుతున్నాయి నేను ఏకాకిని కాదు కదా!"

"నిజమే సంసారం దుఃఖహేతువు"

"భార్య లేకపోయినా నేను సంసారినే" అన్నాను విరక్తిగా.

"భార్య ఉన్నా సంసారిని కాదు నేను" అన్నారు ఆయన

ఆయన అన్నది నిజమే ఆయనకు భార్యేకాదు. పిల్లలు కూడా ఉన్నారు కాని అందర్నీ త్యజించారు

నా నిర్ణయం మరింత దృఢంగా పాతుకుంటోంది.

కాసేపటికి నేనే నిశ్శబ్దాన్ని భంగ పరుస్తూ, "సరే! దీక్ష ఎప్పుడిస్తారో చెప్పండి!" అన్నాను.

ఆయన తలెత్తి నాకళ్ళల్లోకి చూశారు ఏదో అనబోయి అమాయింటుకున్నారు. ఒక నిముషం ఆగి తలవంచుకుని ఇలా అన్నారు

"తొందరేముంది నాయనా కొన్నాళ్ళపాటు మాతో ఉన్న తరువాత నిర్ణయించుదాం! రేపు మాతో పాటు ప్రయాణమవుదువు".

"సరే!" అన్నాను నేను.

నెమ్మదిగా కేశవుని కీర్తిస్తూ భజన గీతం అందుకున్నారాయన. అప్పటి వరకు కునికి పాట్లుపడుతున్న శిష్య లోకరు రంచు తాళాలు మోగించడం మొదలు పెట్టాడు. మిగిలినవాళ్ల గొంతు కలపసాగారు. నేను వాటిలో లీనమై పోయాను. మధ్యమధ్య కొందరు పాట ఆపినా మిగతావాళ్ళు పాడటం వలన భజన ఎక్కడా ఆగకుండా సాగింది. సుమారు తెల్లవారు జాము నాలుగు గంటలకు భజన గీతాలు ఆపివేశారు.

"కొంచెంసేపు విశ్రాంతి తీసుకున్న తరువాత మేం బయలుదేరుతాం నాయనా! ఇంటి దగ్గర నువ్వు కూడా విశ్రాంతి తీసుకునిరా!" అన్నారు.

నేను సరేనని మండపం బయటకు వచ్చాను.

ఇప్పుడు వర్షం జోరుగా పడుతోంది. ఇటిక ముక్కలమీద నాకాలు నిలువక బురదలోకి జారుతోంది. అతికష్టంమీద ఇంటికి చేరేసరికి తడిసి ముద్దయిపో యాను. బట్టలు మార్చుకుని మంచం

# తల్లి పాలు మంచి ఆహారం
# బిడ్డలకెంతో పుష్టికరం



తల్లి పాలలో వున్నాయి
పోషక పదార్థాలన్నీ
అతి స్వచ్ఛం అమిత శుభ్రం
లేదు జ్వరాల అంటు రోగాల భయం

బిడ్డకు పాలిస్తే పెరుగును మమకారం

తప్పక పాలిచ్చే తల్లి
నెల తప్పదు త్వరలో మళ్ళ

**అన్నం తినగలిగే దాకా తల్లి పాలనే పట్టండి**

davp 82/314

మీద పడ్డానో లేదో నిద్ర ముంచుకొచ్చేసింది

ం ం ం

పెరట్లో ఆడవాళ్ళ మాటలు గందరగోళంగా వినబడుతుంటే హఠాత్తుగా మెలకువ వచ్చేసింది. అప్పటికే గదిలోకి బారెడు ఎండవచ్చి పడుతోంది-ఉదయం వరకు ఉన్న ముసురు ఎక్కడపోయిందో!

నా మనసులో ఏదో భయం పీకుతోంది. జయ ఏమీ అఘాయిత్యం చెయ్యలేదు కదా! ఇంతలో పిర్వీకారస్వామి గుర్తు వచ్చాడు ఆయన దగ్గరికి వెళ్ళాలి.

మనస్సు నిగ్రహించుకోలేక పోతున్నాను ఇంట్లో ఏదో జరుగుతూంటే ఏమీ పట్టనట్టు ఎలా పోను.

గబగబా మంచం దిగి పెరట్లోకి వచ్చాను. నలుగురైదుగురు ఆడవాళ్ళు గుంపుగా నిలబడి మాట్లాడుతున్నారు. వీళ్ళంతా మా ఇరుగుపొరుగు బంధువులు వాళ్ల మాట్లాడే మాటలేవీ నా చెవికెక్కటం లేదు

వాళ్ళల్లో ఉన్న లీల నాకు కూతురు వరస చంటి బాబును చంకలో వేసుకు వచ్చింది.

"అమ్మాయ్ లీలా! ఇలారా!" అని పిలిచాను.

వెంటనే నా దగ్గరికి వచ్చింది

"ఏమైందమ్మా? అంతా ఖంగారుగా ఉన్నారు" అన్నాను నా లోపలి ఆందోళనను అదిమిపెడుతూ.

ఆమె కొంచెం నవ్వి, "కాసేపు పిల్లాణ్ణెత్తుకో బాబాయ్! వెధవ! తెగఅల్లరి చేసేస్తున్నాడు" అంది చంటిబాబును అందిస్తూ.

నాకు వెంటనే చేతులు ముందుకు సాగలేదు. వాడు ఒక చేత్తో వాళ్ళమ్మ జుట్టు పీకుతూ, మరో చేత్తో నన్ను దగ్గరగా రమ్మని పిలుస్తున్నాడు

"కాస్త మీ మనమణ్ణి ఎత్తుకోండి బాబాయ్!" అంది ఈసారి నా వైపు యుక్తిగా చూస్తూ.

"మనమణ్ని" అన్నమాట నాలో సంతోషాశ్చర్యాలు కలిగించాయి. వెంటనే వాడిని ఎత్తుకున్నాను.

మళ్ళీ లీల ఆడవాళ్ళ వైపు తిరగబోతుంటే ఆపి. "అసలేమయిందమ్మా?" అన్నాను.

ఆమె మాకోదలు గదివైపు ఓమారు తొంగిచూపి మళ్ళీ నా వైపు తిరిగి, రహస్యం చెబుతున్నట్టు- "జయ ఇప్పుడు మామూలు మనిషి కాదు" అంది. నాకు విషయం అర్థం కావటానికి మరో నిముషం పట్టింది.

చంకలో ఉన్న చంటిబాబు మళ్ళీ లీల చేతుల్లోకి వెళ్లనని మారాము చేస్తు




న్నాడు. అలాగే బాబును చంకనేసుకుని జయ గదిగుమ్మం దగ్గరకు వెళ్లాను.

గదిలోంచి మాటలు తక్కువ స్వరంలో వినవస్తున్నాయి.

ఆమె మంచంమీద కూర్చునిఉంది

రామం నేరస్తుడిలా నిలబడి ఉన్నాడు.

"రాత్రి కింద పడిపోయినప్పుడు దెబ్బేమైనా తగిలిందా?"

"... .. . .. .."

"సరిగా చెప్పు' డాక్టరు దగ్గరికి తీసుకువెళతాను. మరేమీ భయం ఉండదు" ఇంకా ఏదో అంటున్నాడు.

చంటిబాబు నా చెవి దగ్గరికంటా నోరు పెట్టి "తాత" అని అరిచాడు గట్టిగా.

నా తల గింగుర్లెత్తింది.

చటుక్కున నావైపు తిరిగి చూశారు వాళ్ళిద్దరూ.

నేను అక్కణ్ణించి వచ్చేశాను.

సుమారుగా నా వెనకనే రామం వచ్చేశాడు. పెరట్లో ఆడవాళ్లను చూసి తలవంచుకుని వీధిలోకి వెళ్లిపోయాడు. పూర్వం కనపడే ఆ కర్కశమైన చిరునవ్వు కనిపించలేదు. ముఖం అంతా ఆందోళనతో నిండిపోయి ఉంది.

వాడు బయటకు వెళ్లీ వెళ్లగానే పెరట్లో ఆడవాళ్లంతా జయ గదిలోకి బిరబిర లాడుతూ వెళ్ళారు

చంటిబాబు నా మెడ పట్టుకొని వదలటం లేదు. వీధి గుమ్మం దగ్గరికివచ్చి నిలుచున్నాను.

రాత్రి జరిగిందంతా తలుచుకుంటుంటే ఎంతో పేలవంగా అనిపిస్తోంది. ఎంతో త్వరగా తీసుకున్న నిర్ణయం అంత త్వరగానూ సమసిపోయింది.

ఏమైనప్పటికీ నేను ఇక్కడినుంచి కదిలివెళ్లేది లేదు. ఓ చంటిబాబు నా మెడ

చుట్టూ వేతులు వేయడానికి ఈ లోకం లోకి వస్తుంటే ఇక్కడి నుంచి నేనెలా పారిపోతాను।

మనుషుల్ని బంధించి ఉంచే రహస్యం నాకిప్పుడే అవగతమౌతోంది ఈ పిల్లలే లేకపోతే ప్రపంచంలో మనుషులంతా ఒకళ్ళనొకళ్ళు పట్టకుండా చెల్లాచెదురై పోతారేమో...

దూరంగా నిర్వికార స్వామి శిష్య బృందంతో వెళ్ళిపోతూ కనిపించారు. దారిలో ఎదురైన రైతులు వంగి వంగి దండాలు పెడుతున్నారు.

ఆయన పాదాల నిండా బురద అంటి ఉంది. దాడి అంటుకోకుండా వేసిన ఇటికలమీద ఆయన నడవలేక బురద లోనే నడుస్తూ వెడుతున్నారు... ★

ఆదిశక్తి సముత్పన్నే! నమోఽస్తుతే!









చిట్టి కథ:

# జీవితం ఏమిటి?

వేమకోటి సీతారామశాస్త్రి

సన్నగా వర్షం పడుతోంది

మిత్రపంచకం బార్‌లో కూర్చున్నారు.

"జీవితం డల్‌గా వుంటోంది గురూ" అన్నాడు మొదటివాడు.

"జీవితం చాలా ఇంటరెస్టింగ్ సబ్జెక్టు" వ్యక్తపరిచాడు రెండోవాడు.

"జీవితం రంగుల వల" మూడోవాడి ఉవాచ.

"జీవితం ఏమిటో అంతా గందరగోళం" అన్నాడు నాలుగోవాడు గందరగోళంగా.

"జీవితం గందరగోళమే కాదు అయోమయం" అని వాపోయాడు పంచముడు.

ఆఖరికి వాళ్లు చేసినదేమిటంటే పీకలమొయ్యా మందుపట్టించి జీవితం గురించి ఆలోచించటం మానేశారు. ★



ఉగాది పర్వదినాన

నవత ఆర్ట్స్

DIMPLE

Bhaskar

# రాజు రాణి జాకీ

సింగీతం శ్రీనివాసరావు ఎన్. కృష్ణంరాజు

లక్ష్మీ ఫిలింస్

# ఆ అనుభవం కావాలి!



వి. మోహన్‌కుమార్

(పరబ్రహ్మం ఆనందరావుకి తన కంప్యూటర్ చూపించాడు- వివిధ పెళ్ళికొడుకుల సంపూర్ణ వివరాలు చూపింది మిషన్ స్వప్న పెళ్ళి విష యమై కొన్ని సలహాలు ఇచ్చాడు పరబ్రహ్మం. ఆనందరావు కంప్యూటర్ ఇచ్చిన పెళ్ళికొడుకు ప్రకాశ్ గురించిన వేటలో ఆఫీస్‌లో సుదర్శన్‌కి పనిపెట్టాడు.)

-ఇక చదవండి-

# 4

"ప్రకాశ్"

మామయ్య గొంతువిన్న ప్రకాశ్ ఉలిక్కిపడి వెనక్కి చూసాడు. ఉలిక్కి పడడంలో అతని కుంచె చేతిలోంచి జారి ఒళ్లోపడి లాల్చీకి పచ్చరంగుఅంటించి కిందపడింది.

మామయ్య ఆరోజు సాయంత్రం ఆరు గంటలకే వచ్చేసాడంటే ఏదో విచిత్రమే ఉంది.

"ఏమిటి" అన్నాడు ప్రకాశ్.

"ఏం చేస్తున్నావు" ప్రకాశ్ బొమ్మకేసి చూసాడాయన.

"ఇది తర్వాత వేద్దువుగాని. ఇప్పుడు అర్జంటు పని తగిలింది నీలగిరి కెమికల్స్ డైరక్టర్ ఉదయం వస్తాడని చెప్పాను కదా ఉదయం ఫ్లయిట్‌లో రావ డానికి కుదరలేదుట. సాయంత్రం వస్తున్నాడు. ఆరు నలభైకి ఫ్లయిట్ ఉంది నువ్వు వెంటనే ఎయిర్ పోర్ట్‌కి వెళ్ళి ఆయన్ని రిసీవ్ చేసుకుని హోటల్‌కి తీసు కెళ్లు. నేను ఎనిమిది గంటలకి హోటల్లో కలుసుకుంటాను ముగ్గురం అక్కడే డిన్నర్ తీసుకుందాం, ఒకె క్విక్. బయల్దేరు డ్రైవర్ వెయిట్ చేస్తున్నాడు" ఆయన హడావిడిగా లోపలికెళ్ళాడు ప్రకాశ్‌కిదంతా చికాగ్గా అనిపించింది. ఈ రోజు పెయింటింగ్ పూర్తి చేద్దామని కూర్చున్నాడు. మూడ్ కుదిరింది అప్పుడే అంతరాయం. గీసిన ఔట్‌లైన్ వైపు లాల్చీకి అంటుకున్న రంగువైపు చూస్తూ నించున్నాడు

లోపల్నుంచి మంచినీళ్ళు తాగుతూ వచ్చాడాయన



"ఇంకా డ్రెస్ చేసుకోలేదా, ఎయిర్‌పోర్టులో ఓ అయిదు నిమిషాలు ముందే ఉంటే మంచిది" ఆయన తొందరపెడుతున్నాడు

"వేరే ఎవర్నైనా పంపించకూడదా మామయ్యా" సంశయిస్తూ అన్నాడు ప్రకాశ్. దానికి ఏం సమాధానం వస్తుందో అతనికి తెలుసు

"లేదు. నువ్వు వెడితేనే బావుంటుంది"

"ఈసారికి నన్ను వదిలెయ్యి నాకు పనుంది "

"నీ పనేమిటో నాకు తెలుసు. అది ఎప్పుడేనా చేసుకోవచ్చు కాని ఈయన రోజూ రాడు ఈరోజే వస్తున్నాడు మన కంపెనీకి ఎంతో ముఖ్యమైన వాడు. ఆ సంగతి నీకూ తెలుసు అతనితో నీకు పరిచయం అయితే ఏదేనా పని పడ్డప్పుడు నువ్వు చొరవగా ఆయనతో మాట్లాడచ్చు అందువల్ల ఈ అవ కాశం ఎవరికో ఇవ్వడంకన్నా నీకే ఇద్దామని" ఆయన నచ్చచెప్పబోయాడు.

ఇది అవకాశమా? న్యూసెన్స్ ప్రకాష్‌కి కోపం వచ్చింది అయినా అణుచుకుని "నేను ఇంకోసారి అవకాశం తీసుకుంటాను ఈసారి వదిలెయ్యి ఇంక ఎవర్నైనా పంపించు" అన్నాడు

"అంటే నీకు కంపెనీ కన్నా ముష్టి పెయింటింగ్ ఎక్కువన్నమాట" ఆయన కోపంగా అన్నాడు

ప్రకాశ్‌కి కోపం వచ్చింది. తనని అన్నందుకుకాదు తన పెయింటింగ్‌ని చులకనగా చూసినందుకు. ఏదో అనబోయి మళ్ళీ నోరు మూసుకున్నాడు.

"అసలు నేనే వెళ్ళేవాణ్ని అర్జంట్ ఫోన్‌కాల్ వస్తుంది. దానికోసం ఇంట్లో ఉండాలి అందుకే నిన్ను వెళ్ళమన్నాను.'

"పోనీ ఆ కాల్ నేను రిసీవ్ చేసుకుంటాను"

"ఉద్ధరించావు. నీకేది ఇవ్వాలో ఏది నేను చెయ్యాలో నాకు బాగాతెలుసు. థాంక్స్" ఆయన కోపంగా లోపలికెళ్ళిపోయాడు.

ప్రకాష్‌కి చిర్రెత్తుకొచ్చింది మూడ్ పాడయిపోయింది. కుంచె విసిరి కొట్టి విసవిస బయటకెళ్ళిపోయాడు.

వాళ్ళ వ్యవహారం చూస్తున్న లక్ష్మి నిశ్శబ్దంగా ఉండిపోయింది. అలాంటి సంఘటన ఆమెకి కొత్తకాదు.

"అమ్మా లక్ష్మి కాస్త కాఫీ ఇయ్యి" లోపల్నుంచి అరుపు వినిపించింది.

"వస్తున్నా నాన్నా" లక్ష్మి వంటింట్లోకి వెళ్ళింది.

# 5

ఆటో మలుపు తిరిగింది. దాంట్లోంచి పడిపోబోయిన సుదర్శన్, వెంక ట్రావ్ అతి ప్రయత్నంమీద నిలదొక్కుకున్నారు

"కాస్త నెమ్మదిగాపోనియ్యవయ్యా" అన్నాడు సుదర్శనంకలవరపాటుగా.

"ఇదేం స్పీడ్ సార్, నేను బెంగుళూరులో ఇంకా స్పీడుగా నడిపేవాణ్ని. ఇక్కడ యాక్సిడెంట్ కూడా జరగలేదు"

"ఈ రోడ్లు అలా లేవుకదా నాయనా. బెంగుళూరులో నీ ప్రావీణ్యం చూపిస్తే చూపించావుగాని ఇక్కడ కాస్త నెమ్మదిగా పోనీయి. జయప్రకాశ్ నగర్ అంటే ఇదేనసుకుంటా ఇంకాస్త నెమ్మదిగా నడుపు. ఆగు ఎవర్నైనా అడుగుదాం"

ఆటో ఆగింది.

"హలో మాష్టారూ, జయప్రకాశ్‌నగర్ ఇదేనా" దారిన పోతున్న ఒకా యన్ని అడిగాడు సుదర్శన్,

"కాదు ఇది ఇందిరానగర్"

"మరి జయప్రకాష్‌నగర్ ఎక్కడ"

"ఇంకాస్త ముందుకు వెళ్ళండి సంజయ్‌నగర్ వస్తుంది. అక్కడ అడగండి"

"నడు" ఆటో ముందుకి కదిలింది.

"సంజయ్‌నగర్" అన్న బోర్డు కనిపించింది. ఆటో ఆగింది.

"మాష్టారూ. ఇది సంజయ్‌నగర్ కదూ" సుదర్శన్ ఆటోలోంచి అరి చాడు. రోడ్డుకి అవతలవైపున్న వ్యక్తి ఆగి ఆటోవైపు చూశాడు.

"కాదు రాజీవ్ నగర్"

సుదర్శన్ తల తిరిగినట్టయింది "అక్కడ బోర్డు సంజయ్‌నగర్ అని ఉందిగా"

"కాదు ఇది ఇప్పుడు రాజీవ్‌నగర్ అని మారిపోయింది అది పాతబోర్డు"

"సరె పోనీండి. జయప్రకాశ్‌నగర్ ఎక్కడ"

"మీరు కుడివైపుకి తిరగండి అక్కడ పార్కు వస్తుంది. అక్కడ ఉందనుకుంటా"

"ఆటో కుడివైపుకి తిరిగింది. పార్కు రాగానే ఆపాడు.

"జయప్రకాశ్ నగర్ ఎక్కడ"

"ఇది మారుతీనగర్ ఇక్కడ ఎడమవైపు రోడ్డు ఉంది. తిన్నగా వెళితే అది రెండుగా చీలుతుంది ఒక చీలిక ఎత్తుగా కొండమీదికి తీసుకెడుతుంది. మరొకటి లోయలోకి తీసుకెడుతుంది జయప్రకాశ్‌నగర్ అక్కడే ఎక్కడో ఉండాలి"

సుదర్శన్ తల పట్టుకుర్చున్నాడు

ఆటో డ్రైవర్ కిందికి దిగాడు

"సార్ ఇక దిగండి నా ఆటోకి పికప్ లేదు కాబట్టి ఎత్తు ఎక్కలేదు. బ్రేకులు సరిగ్గా లేవు కాబట్టి ఆ లోయలోకి పోలేదు "

"ఉండవయ్యా ఎలాగో నెమ్మదిగా తీసుకెళ్లు ఇంకా ఏరియానే పట్టుకో లేదు. ఇంటి నెంబర్ పట్టుకోడం మరో అధ్యాయం. నడిస్తే కాళ్ల బలపాలు కట్టేస్తాయి. ఎక్‌స్ట్రా డబ్బులిస్తాంలే"

"మీ ఎక్‌స్ట్రా నా కక్కర్లేదు సార్"

అతన్ని బతిమాలి బయల్దేరదీసేసరికి తల ప్రాణం తోకకొచ్చింది. ఆ చీలికలో ఎత్తుమీద దొరికింది జయప్రకాష్ నగర్.

"జయప్రకాష్ నగర్ ఇదేనా అడిగాడు సుదర్శన్.

"ఇదే" అన్నాడు ఆ దారిన పోతున్న ఒకతను.

"అమ్మయ్య 1-1-337/82 ఎక్కడ"

"తెలియదు"

సుదర్శన్, వెంకట్రావ్ ఆటో దిగారు ఎదురుగా ఉన్న గేటు దగ్గర కెళ్ళారు ఓ కుక్క భౌమని మీద పడబోయింది వెంకట్రావ్ సుదర్శన్ని గట్టిగా




కొగలించుకున్నాడు. ఆ కుక్క చైన్ తెంపుకుని వీళ్ళమీద పడ్డానికి విశ్వప్రయత్నం చేస్తోంది పులిలా గాండ్రిస్తోంది. అలాగే సుదర్శన్ నేంప్లేట్ మీద నంబర్ చూసాడు. 1-1-337/81 అని ఉంది.

"వండ్రఫుల్. భలే దొరికింది. పక్కిల్లే మనక్కావలసింది" అని అరిచి సంతోషంగా పక్కింటికెళ్ళాడు. నేంప్లేట్ చూసాడు. 1-1-337/92 అని ఉంది. ఆ పక్కింటి నెంబర్ 1-1-337/93 సరె అనుకుని వెనక్కి వచ్చి మొదటి ఇంటికి ఇవతలవైపు ఉన్న ఇంటికెళ్ళారు దాని నంబర్ 1-1-337/67.

"రోడ్డు కవతలవైపు చూద్దాం సార్" అన్నాడు వెంకట్రావ్. రోడ్డు క్రాస్ చేసారు.

ఎదురుగా ఉన్న ఇంటి నెంబర్ చూసారు అది 1-1-335/21.

"ఏమిటీ నంబర్లు" గట్టిగా విసుక్కున్నారు ఇద్దరూ

"హైదరాబాద్‌లో ఇంటి నంబర్ పుచ్చుకుని ఇల్లు వెదకడం అంటే కుక్కతోక పట్టుకుని గోదావరి ఈదినట్టే. నేను పోతాను సార్. మీకు ఇల్లు ఈరోజు దొరకదు. ఈసారి వచ్చినప్పుడు ఆ ఇంటికి దగ్గరగా ఉన్న స్కూల్ పేరో, ఆస్పత్రి పేరో కనుక్కుని రండి". ఆటో అతను హారన్ మోగించడం మొదలెట్టాడు. వెంకట్రావ్ అతన్ని శాంతింపజేసాడు

"సార్ 1-1,337/82 ఎక్కడ" వాకింగ్‌కి పోతున్న ఓ ముసలాయన్ని అడిగారు.

"వెనక వీధిలో ఉండవచ్చు"

"థాంక్స్ సార్" అంటూ ఇద్దరూ ముందుకి నడిచి కుడివైపుకి తిరిగారు ఆ రోడ్డు అక్కడికి ఆగిపోయింది. ఎదురుగా కొండలు, ఆ కొండమీద ఇళ్ళు. ఆ రెండింటికి కనెక్షన్ లేదు.

"ఇదేమిటి? ముందు రోడ్లు వెయ్యకుండా ఇళ్ల ఎలా కట్టిస్తున్నారు"

"అదంతే ఎవరి దారి వారిదే. రోడ్లు వేసేవాళ్లు వేస్తూ ఉంటారు. అది పూర్తవగానే డ్రైనేజ్‌వాళ్లు, వాటర్ వర్క్స్‌వాళ్లు పెద్ద పెద్ద కందకాలు తవ్వు తారు. ఆ రోడ్డు మళ్ళీ మొదటికొస్తుంది. బాగుపడేది రోడ్లుకాదు - కంట్రాక్టర్లు, ఉద్యోగస్తులు"

"సరె వెనక్కి నడు"

వెనక్కి నడిచి వెనక సందులోకి తిరిగారు.

లాల్చీ పైజామా వేసుకుని ఓ పాతికేళ్ళ కుర్రాడు ఎదురుగా వస్తున్నాడు.

"సార్ 1-1-337/82 ఎక్కడ"

"ఇక్కడ్నుంచి రెండు ఇళ్లు దాటి ఎడమవైపుకి తిరగండి. అక్కడ్నుంచి రెండో ఇల్లు" అతను మరో మాట కోసం ఎదురు చూడకుండా ముందుకెళ్ళి పోయాడు.

"ఇతనెవరు? ఇటీవలే ఎం ఎల్ ఏగా పోటీచేసాడా? ఇంటిని అంత ఖచ్చి తంగా చెప్పగలిగాడు" అన్నాడు సుదర్శనం.

"అది దొరికేంత వరకు నమ్మకం లేదు. మనల్ని వదల్చుకోడం కోసం ఏదో చెప్పుంటాడు"

వాళ్లు అతను చెప్పినట్టే వెళ్ళి ఓ రెండతస్తుల మేడ చేరుకున్నారు నెంబర్ సరిపోయింది. వాళ్ళ ఆనందానికి అవధుల్లేవు. దానిమీద టి. సదాశివరావు అని ఉంది. ఆ ఇంటిపేరు లక్ష్మీనిలయం.

"మనక్కావలసింది కె. ప్రకాష్ కదూ. అంటే అతను ఈ ఇంటాయన కొడుకై ఉండదన్నమాట" సుదర్శన్ ఎనాలిసిస్ మొదలెట్టాడు.

"కొంపతీసి అల్లుడేమో"

"ఛీఛీ! వెనకటికి నీలాంటివాడే శుభం పలకరా అంటే పెళ్ళికూతురు ముండ ఎక్కడ అన్నాట్ట. ఆనందరావుగారికి కాబోయే అల్లుణ్ణి పట్టుకుని సదా శివరావు అల్లుడంటావేమిటి? ఒకవేళ అతను ఈ ఇంట్లో అద్దెకుంటున్నాడేమో. లోపలికి వెళ్ళి అడుగుదాం"



కుక్క అరుపులు వినిపించక పోడంతో ధైర్యంగా తలుపుతీసి లోపలి కెళ్ళారు

కాలింగ్ బెల్ కొట్టారు.

"ఎవరూ"

ఇరవై ఏళ్ళ అమ్మాయి తలుపు తీసింది.

"ప్రకాష్ గారుండే ఇల్లు ఇదేనాండీ"

"అవునండి"

"ప్రకాష్‌గారు ఇంట్లో ఉన్నారా"

"ఎవరూ" అంటూ యాభై ఏళ్ళాయన బయటికి వచ్చాడు

"సదాశివరావుగారంటే మీరేనాండి" సుదర్శన్ అడిగాడు.

"అపునండి. ఏంకావాలి"

"మీరు ప్రకాష్‌గారికి ఏమౌతారండీ" వెంకట్రావ్ తెచ్చిపెట్టుకున్న వినయంతో అడిగాడు.

"ఇంతకీ మీరెవరు" ఎదురుప్రశ్న వేసాడు సదాశివరావు

"మేం స్వప్నా కాస్మెటిక్స్‌కి చెందినవాళ్ళం. నేను బ్రాంచ్ మేనేజర్ని, ఈయన అసిస్టెంట్. ఒకసారి ప్రకాష్‌గార్ని కలుద్దామని"

"నేను లక్ష్మీ కెమికల్స్ మేనేజింగ్ డైరెక్టర్ని. ఆఫీసు పనయితే నాకు చెప్పచ్చు"

"అర్జంటు పనేంలేదు. అయినా ఓసారి కలుద్దామని" వెంకట్రావు అన్నాడు

"ఆయన బయటికి వెళ్ళారు. రేపు ఆఫీసులో కలుసుకోండి లేదా ఫోన్ చేసి ఇంటికి రండి"

"కాసేపట్లో తిరిగొస్తారా అండీ" సుదర్శన్ ఆతృతగా అడిగాడు

"తెలియదండి" ఆయన తలుపేసుకున్నాడు.

"హరేరామ్" అనుకుంటూ ఇద్దరూ కాళ్ళీడ్చుకుంటూ బయటపడ్డారు.

o o o o o o o

ఫోన్ కాల్ తర్వాత ఇవ్వమని చెప్పి సదాశివరావు ఎయిర్ పోర్ట్ కి వెళ్ళాడు.

లక్ష్మి ఆ ఇంట్లో వంటరిగా మిగిలిపోయింది

ప్రకాష్‌ని తలుచుకుంది ప్రకాష్ ఇప్పుడేం చేస్తుంటాడు. ఎక్కడో కూర్చుని ఈ ప్రపంచాన్ని తిట్టుకుంటూ ఉంటాడు. పంజరంలో పక్షిలా ఉన్నాడు ప్రకాష్ పెద్ద ఇల్లు, బాగా నడుస్తున్న ఫాక్టరీ, వ్యాపారం - వీటికి వారసుడయ్యే అవకాశం ఈ స్థితిలో ఇంకొకరుంటే ఎగిరి గంతేసేవారు నాన్న అందించిన చేయూతని అందుకుని, అధికారాన్ని చేపట్టడానికి ఉవ్విళ్ళూరేవారు నాన్న ఎంతో కష్టపడి సమకూర్చాడు వీటిని తనే మొగాడయి వుంటే నాన్న ప్రకాష్‌ని గురించి పట్టించుకునేవాడు కాదు తనకి పని నేర్పించి వారసుడిగా తీర్చిదిద్ది, బాధ్యతల్ని అప్పగించేవాడు కాని తను ఆడదైపోయింది అందుకే నాన్న ప్రకాష్ మీద ఆశ పెట్టుకున్నాడు చిన్నప్పట్నుంచి ఇక్కడే పెరిగిన అతన్ని మేనల్లుడుగా చూట్టం లేదు ఇంటల్లుడి చూసుకుంటున్నాడు. అతన్నే అల్లుడిగా చేసుకుని బాధ్యత నప్పగించి విశ్రాంతి తీసుకోవాలని నాన్న ఆశ.

అయితే అతని మనస్తత్వం వేరు అతని మనసు గుర్రంలా లక్ష్యంవైపు పరుగు తియ్యదు విహంగంలా విహరిస్తుంది అక్కడే అతనికి నాన్నకి పేచీ. ప్రేమించిన వాళ్ళని తృప్తి పరచడం కోసం మనిషి తన ఇష్టాన్ని కొంతవరకు పక్కకి పెట్టడానికి వెనుతియ్యడు. ప్రకాష్‌కి ఇష్టమైన వాటిని తను ఎన్నింటినో నేర్చుకుంది తనకి ఇష్టమైన దాన్ని ప్రకాష్ చేస్తాడు. అయితే మరి నాన్నకి నచ్చేలా ప్రకాష్ ఎందుకు ఉండటం లేదు అతనికి వ్యాపారంమీద ఆసక్తిలేదా? లేక ఈ ఇంటి అల్లుడు కావడం మీద ఆసక్తిలేదా?

లక్ష్మి ఆలోచనలో పడింది.

అతన్ని అడగాలి.

లక్ష్మి నవ్వుకుంది. ఏం అడుగుతుంది.

నన్ను పెళ్ళి చేసుకుంటావా లేదా అని అడుగుతుందా?

లేక

నన్ను పెళ్ళి చేసుకోవాలంటే నాన్నకి నచ్చేలా ఉండాలి అని కండిషన్ పెడుతుందా?

కాసేపు ఆలోచించి కుర్చీలోంచి లేచింది.

"నేను ఇప్పుడే వస్తాను" పనిమనిషికి చెప్పి బయటికి వచ్చింది. అనుకున్నట్టుగానే ఎత్తుగడ్డమీద కూర్చుని ఎదురుగా పల్లంమీద కనిపిస్తున్న సిటీని చూస్తూ ఆలోచిస్తున్నాడతను.

"బావా" అంది లక్ష్మి.

"నువ్వు ఇక్కడికొచ్చావా" ప్రకాశ్ తలెత్తి చూశాడు.

"నీ మూడ్ బాగోకపోతే నువ్వు ఎక్కడుంటావో నాకు తెలుసుగా. అందుకే వచ్చాను" అతని పక్కన కూర్చుంది లక్ష్మి.

అతని [illegible] పట్టుకున్న పచ్చరంగును చూసి నవ్వింది

"[illegible]"

"నువ్వు పెయింట్ చేస్తున్నది నీ లాల్చీమీదా లేక కాన్వాసు మీదా"

ప్రకాశ్ లాల్చీవైపు చూసుకున్నాడు.

"కుంచె పడిపోయింది."

"నీ పెయింటింగ్ ఏమయింది ఇలా వచ్చేసావేం నువ్వు పెయింటింగ్‌లో ఉన్నప్పుడు [illegible] రావొద్దు కదా" అంది లక్ష్మి.

"[illegible] పెళ్ళంటే పరిపోయుండేది" తనలోతను అనుకుంటున్నట్టుగా అన్నాడు ప్రకాశ్.

"బావా నాన్న నిన్ను ఎందుకలా అడిగారో ఆలోచించు. ఆయన తర్వాత కంపెనీకి నువ్వే అధికారివి కావాలని కదా! నీకు ఆ విషయంలో ఆసక్తి లేకపోతే నాన్నకి చెప్పు. వేరే ఏర్పాటు చేసుకుంటారు"

ప్రకాశ్ చటుక్కున తలెత్తి లక్ష్మి కళ్ళలోకి చూసాడు

"కోపం వచ్చిందా? కంపెనీకి మేనేజింగ్ డైరెక్టర్ కాబోయేవాడికి ఇంత బద్ధకమైతే ఎలా?" బుజ్జగిస్తున్నట్టుగా అంది.





"బద్ధకం కాదు. ఇష్టంలేదు. నాకు ఆ బిజినెస్ అంటే బోర్. ప్రతివాణ్ణీ కలుసుకోడం తెచ్చిపెట్టుకున్న మర్యాద చూపించడం నాకు నచ్చదు"

"ఆమాటే ఆయనకి చెప్పకూడదూ"

"చెప్పే ధైర్యం లేదు. నా చిన్నప్పటినుంచి ఆయన నామీద ఆశ పెట్టుకున్నాడు"

"అవును కొడుకువైనా అల్లుడివైనా నువ్వే అనుకుంటున్నాడు నాన్న" లక్ష్మి తలవంచుకుని అంది. దీనికి ప్రకాశ్ చెప్పే సమాధానం తన సంశయాన్ని పటాపంచలు చేస్తుంది.

ప్రకాశ్ ఆలోచనలో పడ్డాడు. అతనికి తెలుసు మామయ్య చిన్నప్పటి నుంచి తనని అల్లుడిగానే చూసుకుంటున్నాడు యావదాస్తికి వారసుడుగానే చూస్తున్నాడు. లక్ష్మి మంచి అమ్మాయే ఆ అమ్మాయంటే అభిమానమే కాని తనలాంటి అందగాడు, కళాకారుడు పెళ్ళి చేసుకోడానికి ఆమెలో ఏ ప్రత్యేకత ఉంది. అతి సామాన్యంగా ఉండే ఆమెని తనెలా చేసుకోగలడు. ఎన్నోసార్లు "మామయ్యా నాకు నువ్వంటే గౌరవం. లక్ష్మి అంటే అభిమానం. కాని మీ ఇంటికి అల్లుణ్ణి కాలేను" అని చెప్పాలనుకున్నాడు. కాని అలా చెప్పడానికి నోరు రాలేదు. చిన్నప్పటినుంచి పెంచి పెద్దచేసిన మామయ్యని నొప్పించాలన్నా తన పట్ల మమకారం పెంచుకున్న లక్ష్మికి అప్రియమైన మాట చెప్పాలన్నా తనకి ధైర్యం చాలటంలేదు. అందుకే అలా నిర్లిప్తంగా పెంకెగా ప్రవర్తిస్తున్నాడు. ఏదో ఓనాడు మామయ్యే పిలిచి "నీ నిర్వాకం చాలు సారీ" అనకపోతాడా అని

ఆశ. అలా అంటే తను అనుకున్నది అవుతుంది. తన తప్పు ఉండదు

"నీ మూడ్ పాడుచేసుకుని ఏం చేశావు. ఇక్కడకు వచ్చి కూర్చున్నావు. ఇలా కూర్చునే బదులు ఎయిర్‌పోర్ట్‌కి వెళ్ళుంటే కనీసం నాన్న సంతోషించేవాడు. లేదా మూడ్ పోగొట్టుకోకుండా నీ పెయింటింగ్ పూర్తి చేసుంటే నువ్వైనా సంతోషించి ఉండేవాడివి"

"అవును. నేను సుఖపడలేను. ఇంకొకళ్ళని సుఖపెట్టలేను"

"అలా అనకు. ఇంటికి పోదాంరా"

అతను బయల్దేరాడు.

భోజనం చేసి "లక్ష్మి, నేను సినిమాకి పోతున్నాను మూడ్ బాగోలేదు అని స్కూటర్ తీసుకుని వెళ్ళిపోయాడు.

రాత్రి పదిన్నరకొచ్చాడు సదాశివరావు

"ప్రకాశ్ ఏడీ" లక్ష్మిని అడిగాడు

"మూడ్ బాగోలేదట. సినిమాకి వెళ్ళాడు పోనీ నాన్నా బావని కొంత కాలం వదిలెయ్యకూడదు. అప్పుడే బాధ్యతలు ఎందుకు"

"ఇప్పుడు నేర్చుకోకపోతే ఎప్పుడు నేర్చుకుంటాడు, త్వరలో బాధ్యత చేపట్టి నాకు విశ్రాంతిని ఇస్తాడేమో అనుకుంటే ఇంకా ఇలాగే ఉన్నాడు."

ఆయన లోపలికి వెళ్ళిపోయాడు

# 6

"సార్ సుదర్శన్‌ట. స్వప్నా కాస్మెటిక్స్ నుంచి వచ్చారట మిమ్మల్ని చూడాలంటున్నారు" రిసెప్షనిస్ట్ అడిగింది.

"రమ్మనమనండి" సురేష్ ఫోన్ పెట్టేసి కాగితం మీద పెన్సిల్‌తో గీతలు గీస్తూ ఆలోచిస్తున్నాడు

"నమస్కారం" తలుపు తెరుచుకొని ఇద్దరు వ్యక్తులు ప్రవేశించారు

"నా పేరు సుదర్శన్ స్వప్నా కాస్మెటిక్స్ బ్రాంచ్ మేనేజర్ని ఇతను వెంకట్రావ్ అసిస్టెంట్ మేనేజర్"

"కూర్చోండి"

అతన్ని పరిశీలనగా చూసిన సుదర్శన్ ఆశ్చర్యపోయాడు. నిన్న సాయంత్రం అంత ఖచ్చితంగా ఇంటికి దారిచెప్పిన వ్యక్తి ఇతనే

ఉచితం ఉచితం

# పాప క్షమాపణ

ఒకనాడు ఒక పేదపిల్ల రాణిగారి పూలతోటలోనికి ధైర్యముగా అడుగు పెట్టి, తోటమాలితో డబ్బు తీసుకొని గులాబీలను వెంటని తన వ్యాధిగ్రస్తురాలైన తల్లికోసం ఇవ్వమని వేడుకొంది రాణి గారి తోటలోని పూలు అమ్మే అధికారం తోటమాలికి లేదు. అందుకే అక్కడ అమ్మకానికి పూలు లేవని చెప్పాడు పాపం ఆపిల్ల చిన్నబోయిన ముఖంతో వెనుదిరిగింది తోటలోవున్న రాణిగారు ఇదంతా చూచి నిరాశతో వెళ్తున్న ఆ పిల్లను పిల్చి, ఇక్కడ పూలు అమ్మకానికి కాదు గాని, రాణిగారు తలుచుకుంటే వీటిని బహుమానం ఇవ్వగలరని చెప్పి తన గంపలోని శ్రేష్టమైన పూలలో కొన్ని తీసియిస్తు ఇవి నీ తల్లికి బహుమానం ధర యివ్వనక్కరలేదు. పూలతో పాటు నాప్రేమ కూడా నీతల్లికి అందజేయి" అని పలికింది

ప్రియ పాఠకులారా! పాపక్షమాపణ కూడా ధరచెల్లించి ఎవరూ కొనలేరు. చేసిన పాపానికి ప్రాయశ్చిత్తముగా పేదలకు దానంచేసి, ధర్మసత్రాలు కట్టించినంత మాత్రాన సంతోషించి పాపక్షమాపణ చేయటానికి దేవుడు లంచగొండి కాదు ఉచితంగా పాప క్షమాపణ చేయటానికి సిద్ధంగా వున్నాడు పశ్చాత్తాపముతో పాపమార్గమును విడచి ఆయన చెంతకు వచ్చే వారందరికి ఈ పాపక్షమాపణ ఉచితం. దీనిని విశ్వసించి ఆ ప్రభువును అంగీకరిస్తే ఈ క్షమాపణతో పాటు ఈ లోకములో కాపుదల, పరలోకంలో నిత్య జీవం

---

ఉచితం!! ఉచితం!!

దైవస్వరూపుడైన యేసుక్రీస్తు జీవిత చరిత్ర, ఆయన కమనీయబోధలు తెలిపే అందమైన పుస్తకం ఉచితంగా పొందదలచుకుంటే మీ చిరునామా ఈరోజే తెల్పండి. పోస్టు ఖర్చులు మేమే భరించి మీకు వెంటనే ఉచితంగా పుస్తకం పంపుతాము.

ఇదీ అడ్రసు

డా॥ ఎస్. జాన్ డేవిడ్

పోస్టుబాక్సు 14, చిలకలూరిపేట

గుంటూరు జిల్లా.

"నిన్న మీ ఇంటికి వెళ్ళాం. మీరు ఇంట్లో లేరు. సదాశివరావుగార్ని కలిసాం. మిమ్మల్ని ఆఫీసులో కలవమన్నారు" సుదర్శన్ ఉత్కంఠగా అతనివైపు చూసాడు. అతను తలవంచుకుని అలాగే గీతలు గీస్తున్నాడు. అతని రూం శుభ్రంగా ఉంది టేబుల్, ట్రేలు ఖాళీగా ఉన్నాయి. ఎక్కడా పేపర్ల జాడ లేదు.

"చెప్పండి" అన్నాడు ప్రకాష్.

ఏం సమాధానం రాకపోవడంతో "పని మీద వచ్చారా" అని అడిగాడు.

"పనేం లేదు మిమ్మల్ని చూద్దామని వచ్చాము" నీళ్లు నమిలాడు సుదర్శన్.

"సదాశివరావుగారు మీకేమవుతారు" వెంకట్రావు అడిగాడు.

"మీరు వచ్చింది ఆఫీసు పనిమీదా లేక పర్సనల్ పనిమీదా" అడిగాడు ప్రకాశ్

"అబ్బె ఊరికినే"

"అయితే ఇంటిదగ్గర కలవండి"

వాళ్లు తెల్లబోయారు. వెంకట్రావు ఏదో అనబోతూండగా సుదర్శన్ అడ్డుపడి "సరె" అని లేచాడు.

వాళ్లు బయటికి వెళ్ళిపోయారు.

"వెంకట్రావ్! నిన్ను తీసుకురావడం పిల్లిని చంకన పెట్టుకురావటం లాంటిది. నిన్న వాళ్ళింటిదగ్గర ఆయన్ని పట్టుకుని 'మీరు ప్రకాష్‌కి ఏమవుతారండీ' అని అడిగావు. ఆయన కస్సుమన్నాడు. ఇప్పుడు ఇతన్ని పట్టుకుని 'సదాశివరావు మీకు ఏమవుతారండీ' అని అడిగావు. ఈయన బుస్సుమన్నాడు. మనం వచ్చినపని తుస్సుమంది. ఇలాగేనా కూపీ లాగడం" సుదర్శన్ విసుక్కున్నాడు

"ఈ సంబంధం వద్దని చెప్పేద్దామండి తలతిక్క మనుషుల్లా ఉన్నారు"

"నోడి నీ రికమండేషన్ కోసం ఆనందరావుగారు కాచుక్కూచున్నారు. ఇప్పుడు ఆయన అడిగితే ఏం చెప్పాలి. ఏం వివరాలు చెప్పాలి. ఏం కనుక్కోలేకపోయాం అని చెప్పాలా" సుదర్శన్ తలపట్టుక్కూచున్నాడు.

(సశేషం)

oo oo oo

Edited & Published by V. Leelavathy Raghavaiah, at 1-8-519/11 Chikkadpally, Hyd-20 & Printed by P. Ramakrishna at Raghava Printers, 1-3-4/1/1, Chikkadpalli, Hyderabad-500020



# ప్రగతిపథంలో పైపైకి

తొమ్మిదవ ఆసియా క్రీడలను విజయవంతంగా నిర్వహించినందుకు ప్రపంచమంతా భారతదేశాన్ని అభినందించింది

స్టేడియములను అతి తక్కువ కాలంలో నిర్మించాయి దేశ విదేశాలలో అనేక కోట్ల ఇళ్ళలో ప్రజలు రంగుల టెలివిజన్‌లో ఈ క్రీడలను పాక్షత్తు అవి జరుగుతుండగా చూశారు కంప్యూటర్లు ఎలక్ట్రానిక్ ఎక్స్చేంజిలు మైక్రోవేవు ఉపగ్రహాలను చక్కగా వినియోగించి విస్తృతమైన సౌకర్యాలను కలిగించాము





ఐకమత్యమే మహా బలం, కష్టేఫలే అన్నదానికి ఇది ఒక మచ్చుతునక.

ఇదే ఉత్సాహంతో కృషి చేస్తే దేశాభివృద్ధికి చెందిన ఇతర రంగాలలో ఇదే విధంగా విజయాన్ని సాధించగలం

**దేశాన్ని పటిష్టం చేసేందుకు మనమందరం చేతులు కలుపుదాం**

davp 82/575

